Ram & Co. Serial No. 10

# DASARADHI SATAKAM.

WITH

## Meanings and Notes, Etc.

# దాశరధిశతకము.

టీకా తాత్పర్య సహితము.

---

పబ్లిషర్సు.

మారుతీరాం అండ్ కో.

బుక్కుసెల్లర్సు,

బెజవాడ.

1924.

 [వెల 0-5-0.

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

పమనెడి, అర్ణవ=సముద్రమును, ఉత్తారక = దాఁటించునట్టి, నామ = పేరు గల, కరుణాపయోనిధీ = దయాసముద్రుఁడవగు, భద్రగిరి = భద్రాచలమందు నివసించియున్న, దాశరథీ=దశరథుని కుమారుఁడైన శ్రీరామా.

తా. శ్రీరఘుమహారాజు వంశమునబుట్టి అందమగు తులసిదండదాల్చి, శమదమాది మంగళగుణములచే నొప్పి, మూఁడులోకములందును స్తుతికెక్కిన పరాక్రమసంపత్తిచే, ప్రకాశించి కబంధుఁడను రాక్షసుని చంపి,లోకులపాపములను పారదోలుచు, కరుణాసముద్రుఁడవై భద్రాచలమందు నివసించియున్న దశరథకుమారుఁడవైన రామా.

ఉ. రామ విశాలవిక్రమ ప • రాజిత భార్గవరామ, సద్గుణ
స్తోమ, పరాంగనావిముఖ • సువ్రతకామ, వినీలనీరద
శ్యామ, కకుత్స్థ వంశకల • శాంబుధిసోమ, సురారిదోర్బలో
ద్దామవిరామ భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 2

టీ. రామ=అందరిని రమింపఁజేయువాఁడా, విశాల = అధికమైన విక్రమ=పరాక్రమముచేత, పరాజిత=ఓడింపఁబడిన. భార్గవరామ = భృగు వంశమునఁబుట్టిన పరశురాముఁడను పేరు గలవాఁడా, సద్గుణస్తోమ=సత్ + గుణ=మంచిగుణముల, స్తోమ= సమూహమైన వాఁడా, పరాంగనా=పరస్త్రీలయందు; విముఖ=పెడమొగముగల, సువ్రత=మంచివ్రతమునందు, కామ= రక్తిగలవాఁడా, వినీల=మిక్కిలి నల్లనయిన, నీరద=మేఘమువలె, శ్యామ= నల్లనయిన, కకుత్స్థ=ఇక్ష్వాకువంశ్యులలో నొకఁడైన, వంశ=వంశమనెడి, కలశ + అంబుధి=పాలసముద్రమునకు, సోమ=చంద్రుఁడైనవాఁడా, సురారి=దేవతలకు శత్రువులయిన రాక్షసులయొక్క, దోర్బల=భుజబలముయొక్క, ఉద్దామ=అత్యంతమైన, విరామ=విశ్రాంతిగలవాఁడా, కరుణాపయోనిధీ=దయాసముద్రుఁడా, భద్రగిరిదాశరథీ=భద్రాచలరామా.

తా. అందముచే సర్వజనులను రంజింపఁజేయుచు, గొప్పపరాక్రమముచే పరశురాముని గెలిచి, ఇతర స్త్రీలయందాసక్తిలేనివాఁడవై, నల్లనిమేఘమువంటి దేహకాంతితో నొప్పి, కౌశికసవనమును, వర్ధిల్లఁజేసి రాక్షసుల బలములను తగ్గించి దయకలవాఁడను కీర్తిపొందిన భద్రాద్రిరామా.

చ. అగణితసత్యభాష, శర • ణాగతపోష, దయాలసజ్ఝరీ
విగళితసమస్తదోష, పృథి • వీసురతోష, త్రిలోకపూతకృ
ద్గగనధునీమరంద పద • కంజవిశేష మణిప్రభా ధగ
ద్ధగితవిభూష, భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 3

టీ. అగణిత=ఎన్నరాని, సత్య=సత్యము, భాష=మాటలాడువాఁడా, శరణాగత=శరణుజొచ్చినవారిని, పోష=పోషించువాఁడా, దయా=కనికరయనెడి, లసత్=ప్రకాశించుచున్న, ఝరీ=ప్రవాహముచేత, విగళిత=పోయిన సమస్త=సకలమైన, దోష=(ఆశ్రితుల) దోషములుగలవాఁడా, పృథివీసుర=బ్రాహ్మణులను, తోష=సంతోషపెట్టువాఁడా, త్రిలోక=మూఁడులోకములను, పూతకృత్=పవిత్రముచేయుచున్న, గగనధుని=ఆకాశనదియైన గంగను, మరంద=పూఁదేనెగల, పదకంజవిశేష=చరణపద్మవిశేషముగలవాఁడా, మణి=రత్నములయొక్క, ప్రభా=కాంతిచేత, ధగద్ధగిత=ధగధగమని ప్రకాశింపఁజేయబడిన, విభూష=సొమ్ములుగలవాఁడా, కరుణాపయోనిధీ=దయాసముద్రుఁడా, భద్రగిరిదాశరథీ=భద్రాచలవాసుఁడైన రామా.

తా. నిజస్థుఁడును, శరణాగతులను రక్షించువాఁడును, ఆశ్రితుల పాపములనన్నిటిని యెక్కువదయచేత పారదోలువాఁడును, బ్రాహ్మణులను సంతోషపెట్టువాఁడును, మూఁడులోకములను పవిత్రముగాఁ జేయునట్టి గంగ పుట్టిన చరణారవిందమును గలవాఁడును, రత్నముల కాంతులచే ఎక్కువగ మెఱయుచున్న నగలను ధరించినవాఁడును, దయగలవాఁడును, భద్రాచల వాసియునగు శ్రీరామా.

ఉ. రంగదరాతిభంగ, ఖగ • రాజతురంగ, విపత్పరంపరో
త్తుంగతమఃపతంగ, పరి • తోషితరంగ, దయాంతరంగ స
త్సంగధరాత్మజాహృదయ•సారసభృంగ, నిశాచరాబ్జమా
తంగ, శుభాంగ, భద్రగిరి•దాశరథీ కరుణాపయోనిధీ 4

టీ. రంగత్ = ప్రకాశించుచున్న, అరాతి = శత్రువులను, భంగ = ఓడించువాఁడా, ఖగరాజ = పక్షిరాజగు గరుత్మంతుఁడనెడి, తురంగ = గుఱ్ఱము గలవాఁడా, విపత్ = ఆపదలయొక్క, పరంపరా = యెడతెగని, ఉత్తుంగ = మిక్కిలియైన, తమః = చీకటికి, పతంగ = సూర్యుఁడైనవాఁడా, పరితోషిత = మిక్కిలి సంతోషపెట్టఁబడిన, రంగ = రంగస్వామి, దయాంతరంగ = దయగల మనస్సు గలవాఁడా, సత్ + సంగ = సజ్జనులతోడి కూడిక గలవాఁడా, ధరాత్మజా = భూదేవికూఁతురైన సీతాదేవియొక్క, హృదయ = మనస్సు అనెడి, సారస = పద్మమునకు, భృంగ = తుమ్మెదయైనవాఁడా, నిశాచర = రాక్షసులను, అబ్జ = తామరలకు, మాతంగ = ఏనుగుఆయినవాఁడా, శుభాంగ = మంగళమైన అవయవములు గలవాఁడా, కరుణాపయోనిధీ, భద్రగిరి, దాశరథీ.

తా. శత్రువుల గర్వమడంచువాఁడును, పక్షివాహనారూఢుఁడును, ఆశ్రితుల యాపదలను పోఁగొట్టువాఁడును, రంగనాథుని సంతోషపెట్టినవాఁడును, దయగల మనస్సుగలవాఁడును, సత్పురుషులచే కొలువఁబడినవాఁడును, సీతయొక్క ప్రేమకును, ధ్యానమునకును విషయమైనవాఁడును, దయాసముద్రుఁడునగు భద్రాచలరామా.

ఉ. శ్రీద సనందనాదిముని • సేవితపాద దిగంతకీర్తిసం
పాద సమస్తభూతపరి • పాలవినోద విషాద వల్లికా
చ్ఛేద ధరాధినాథకుల సింధుసుధామయపాద నృత్తగీ
తాదివినోద భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 5

టీ. శ్రీద=సంపదను ఇచ్చువాఁడా, సనందనాది = సనందుడు మొదలయిన, ముని=ఋషులచేత, సేవిత=కొలువఁబడిన, పాద=చరణములు, దిగంత=దిక్కుకొనలయందలి, కీర్తి=యశస్సుయొక్క, సంపాద=సంపాదనము, సమస్త=సకలమైన, భూత=ప్రాణులయొక్క, పరిపాల=రక్షించుటయందు, వినోద=వేడుకగలవాఁడా, విషాద=దుఃఖమనెడి, లతికా=తీగను ఛేద=త్రెంచువాఁడా, ధరాత్మజా = సీతయొక్క, ముద=సంతోషము, సింధు=సముద్రమునకు, సుధామయ=అమృతమయుఁడైన, పాద=కిరణములుగల చంద్రుఁడైనవాఁడా, నృత్త=నాట్యము, గీత=పాట, ఆది=మొదలయిన, వినోద=వేడుకలుగలవాఁడా,

తా. భక్తులకు సంపదల నిచ్చుచు, సనకసనందనాది ఋషులు కొలుచునట్టి పాదములుగలిగి, దిక్కులయందెల్లఁ బ్రసిద్ధిగాంచి, సకలప్రాణులను లీలమెయిఁ రక్షించుచు, దుఃఖములను బోఁగొట్టుచు, సీతకు సంతోషము నుద్భవింపఁజేసి, దానికి అభివృద్ధిగలిగించి నృత్తగీతాదులగు వేడుకలం బ్రసిద్ధుఁడైన దయాసముద్రుండగు భద్రాచలరామా.

ఉ. ఆర్యుల కెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యుల కంజలెత్తి కవి • సత్తములన్ వినుతించి కార్యసౌ
కర్య మెలర్ప నొక్కశత • కంబొనఁగూర్చి రచింతు నేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపుమిది • దాశరథీ కరుణాపయోనిధీ. 6

టీ. ఆర్యులకున్ ఎల్లన్=పెద్దలకందఱికిని, వినతాంగుఁడనై=అడఁకువచేత వినమ్రములైన అవయవములు గలవాఁడనై, మ్రొక్కి, రఘునాథభట్టరాచార్యులకున్=రఘునాథభట్టరు అనెడి గురువునకు అంజలెత్తి=చేయిమోడ్చి, కవిసత్తములన్=కవిశ్రేష్ఠులను, వినుతించి=పొగడి, కార్యసౌకర్యము=కార్యము సులభముగా చేయఁగూడుటను, ఎలర్పన్=కలుగ, ఒక్కశతకంబు=ఒకశతకమును, ఒనగూర్చి=జేసి, నేఁడు=నేటిదినము ఇప్పుడనుట,

స్ఫురదరవింద నేత్ర, ఘన • పుణ్యచరిత్ర వినీలభూరికం
ధరసమగాత్ర, భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 9

టీ. దురిత=పాపమనెడి, లతా=తీఁగలకు, లవిత్ర=కొడవలియైనవాఁడా, ఖరదూషణ=ఖరుఁడు దూషణుఁడుఅను, కానన=అడవికి, వీతిహోత్ర=అగ్నియైనవాఁడా, భూ=భూమియొక్క, భరణ=భరించుటయను, కళా=విన్నాణముచేత, విచిత్ర=విచిత్రుఁడైనవాఁడా, భవ=పుట్టుకయనెడి, బంధ=ముడిని, విమోచన=విడుచుటయను, సూత్ర=విధిగలవాఁడా, చారు=సుందరమై, విస్ఫురత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, అరవింద = తామరలవంటి, నేత్ర=నేత్రములుఁగలవాఁడా, ఘన=మిక్కిలియు, పుణ్య=పవిత్రమైన, చరిత్ర=చరిత్రములుఁగలవాఁడా, వినీల=ఎక్కువనల్లనై, భూరి=అధికమైన కంధర=మబ్బుతోడ, సమ=సమానమైన, గాత్ర=శరీరముగలవాఁడా.

తా. తీఁగలనెడి పాపములను కొడవలితోఁ ద్రుంచుచు, అగ్ని అడవిని వలె ఖరదూషణులను నాశముచేసి, నానావిధలీలలచె భూమిని భరించుచు, జన్మ పరంపరలను మాలించుచు, తామరపువ్వుల వంటి సొగసైనకన్నుఁగవ గలిగి, మిక్కిలి పావనమైన చరిత్రమునం బ్రవర్తిల్లి నల్లని మబ్బువంటి శరీరమును దాల్చి కరుణా సముద్రుఁడవైన భద్రాచల రామా.

చ. కనకవిశాలచేల భవ • కానన శాతకుఠారధార స
జ్జనపరిపాల శీల దివి • జస్తుతసద్గుణకాండ కాండసం
జనితపరాక్రమక్రమ వి • శారద శారదకందకుంద చం
దనఘనసారసారయశ • దాశరథీ కరుణాపయోనిధీ. 10

టీ. కనక=బంగారమయమును, విశాల=ఎక్కువైనదియును, అగు, చేల=వస్త్రముగలవాఁడా, భవ=పుట్టుకయనెడి, కానన=అడవికి, శాత వాఁడి=యైన, కుఠార=గొడ్డలియొక్క, ధార=వాదరయైనవాఁడా, సజ్జన=యోగ్యులను

పరిపాల = రక్షించుటయే, శీల = స్వభావముగాఁగలవాఁడా, దేవతల చేత, స్తుత=స్తోత్రముచేయఁబడిన, సద్గుణ=మంచిగుణముల, కాండ=సమూహముగలవాఁడా, కాండసంజనిత=వీటియందుపుట్టిన అగ్నియొక్క, పరాక్రమ=శౌర్యముయొక్క, క్రమ=విధమునందు, విశారద=పండితుఁడయిన వాఁడా, శారద=శరత్కాల సంబంధియైన, కంద=మబ్బు, మల్లి=మొల్లలు, చందన=చందనము, ఘనసార=పచ్చకర్పూరము, సార=శ్రేష్ఠమైన, యశః=కీర్తిగలవాఁడా.

తా. విశేషమైన బంగరు బట్టనుగట్టి, పదునైన గొడ్డలిచే అడవిని నఱుకునట్లు జన్మపరంపరను నాశముచేసి, సత్పురుషులను రక్షించుటయే స్వభావముగలిగి దేవతలు పొగడునట్టి గుణగణములచే రాణించి, అగ్నివంటి పరాక్రమముతోఁగూడి శరత్కాల మేఘములు, మల్లె, చందనము పచ్చకప్పురము వలె తెల్లనై పెరయుచున్న కీర్తిగలిగి, కరుణానిధివయిన భద్రాచలరామా.

ఉ. శ్రీరఘువంశతోయధికి • శీతమయూఖుఁడవైననీపవి
త్రోరుపదాబ్జముల్ వికసి • తోత్పలచంపకవృత్తమాధురీ
పూరితవాక్ప్రసూనములఁ • బూజలొనర్చెదఁ జిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 11

టీ. శ్రీ=సంపత్కరమైన, రఘువంశ=రఘురాజువంశమనెడి, తోయధికిన్=సముద్రమునకు, శీతమయూఖుఁడవు=చంద్రుఁడవు, ఐన=అయినట్టి, నీ=నీయొక్క, పవిత్ర=పావనములును, ఉరు=గొప్పవియు, శ్రేష్ఠ, పదాబ్జముల్=తామరలవంటి యడుగులను, వికసిత=ప్రకాశించిన, ఉత్పల=ఉత్పలమాలికలు, చంపక=చంపకమాలికలు అనెడి, వృత్త=వృత్తములయొక్క యొక్క, మాధురీ=తీయఁదనముచేత, పూరిత=నింపఁబడిన, వాక్=వాక్యములనెడి, వికసిత=వికసించిన, ఉత్పల=నల్లగలువలయు, చంపక=సంపెంగలయు, వృత్త=వర్తనముగలవియు, మాధురి=చక్కఁదనముచేత, పూరిత=నిం

డిసపియు, ఊగు, ప్రసూనములన్ = పువ్వులచేత, ఒనర్చెదను - చేసెదను, తారక = సంసారమును తరింప జేయునట్టి, నామ = దివ్యనామముగలవాఁడా, చిత్తగింపుమీ = అంగీకరింపుమా.

తా. చంద్రుఁడు తాను పుట్టినసముద్రమును వృద్ధిజేయునట్లు రఘుమహారాజువంశమునంబుట్టి దానిని వృద్ధిజేయువాఁడవైన నీయొక్క పాదారవిందములను ఉత్పలచంపకమాలికా వృత్తములందలి వాక్కులనెడి ఉత్పల చంపక పుష్పములచేతఁ బూజించుచున్నాను. కయికొనుమా.

చ. గురుతరమైన కావ్యరస • గుంభనకబ్బురమందిముష్కరుల్
సరసులమాడ్కి సంతసిల • జాలుదురోటుశశాంకచంద్రికాం
కురముల కిందుకాంతమణి • కోటిస్రవించిన భంగివింధ్యభూ
ధరమున జాఱునే శిలలు • దాశరథీ కరుణాపయోనిధీ. 12

టీ. గురుతరము = మిక్కిలి గొప్పది, ఐన, కావ్య = కావ్యమునందలి, రస = శృంగారాదిరసములయొక్క, గుంభనమున్ = కూర్పునకు, ముష్కరుల్ = రసజ్ఞతలేని మూఢులు, సరసులమాడ్కి = రసికులవలె, అబ్బురము అంది = ఆశ్చర్యమును పొంది, సంతసిలన్ = సంతోషించుటకు, చాలుదురోటు = శక్తులగుదురా, శశాంక = చంద్రునియొక్క, చంద్రిక = వెన్నెలలయొక్క, అంకురములన్ = మొలకలకు, ఇందుకాంతమణి = చంద్రకాంతమణులయొక్క, కోటి = సమూహము, స్రవించినభంగిన్ = కరఁగిజాఱినరీతిని, వింధ్య భూధరమున = వింధ్య పర్వతమునందు, శిలలు = రాలు, జాఱునే = కరగునా.

తా. చంద్రకాంతమణులు చంద్రుని కిరణములకు కరగునట్లు వింధ్య పర్వతపు కొండలు కరఁగి, స్రవింపఁజాలవు. ఇట్లే గొప్పకావ్యమునందలి రసస్ఫూర్తికి రసికులవలె మూఢులు మెచ్చి సంతోషింపఁజాలరు. కావున నాకావ్యమును సరసుఁడవైన నీకు అంకితము యిచ్చుచున్నాను.

చ. తరణికులేశ నానుడులఁ • దప్పులు గల్గిన నీదునామ స
ద్విరచిత మైనకావ్యము ప • విత్రముగాదె వియన్నదీజలం
బరగుచువంకయైన మలి • నాకృతిబాఱినఁదన్మహత్త్వముం
దరమె గణింపనెవ్వరికి • దాశరథీ కరుణాపయోనిధీ. 13

టీ. తరణికులేశ = సూర్యవంశమునందు జనించిన వారిలో శ్రేష్ఠుఁడైన వాఁడా, నానుడులన్ = నామాటలందు, తప్పులు = దోషములు, కలిగినన్ = కలిగినప్పటికిని, నీదు = నీయొక్క, నామ = పేరుతో, సత్ = శ్రేష్ఠమయిన దియు, విరచిత = రచింపఁబడినదియు, ఐనకావ్యము = అయినట్టికావ్యము, పవిత్రము కాదె = పావనమే యగునుకాదా, వియన్నదీజలంబు = ఆకాశగంగ యొక్క నీరు, అరుగుచున్ = ప్రవహించుచు, వంకయైన = వంకరగానయినను, మలిన ఆకృతిన్ = మురికిగల ఆకారముతో, పాఱినన్ = ప్రవహించినను తన్మహత్త్వమున్ = దానిమహత్త్వమును గణింపన్ = ఎన్నుటకు, ఎవరికిన్ = శక్యమా, శక్యముకాదు.

తా. సూర్యవంశమున జనించినవారిలో గొప్పవాఁడా నామాటల యందు దోషము లెన్నియున్నను, నీయొక్క నామముతోడ శ్రేష్ఠమయినది యు రచింపఁబడినదియు, కావ్యము పవిత్రమైనదికాదా? (అగుననుట) అనఁగా ఆకాశగంగయొక్క నీరు ప్రవహించుచు, వంకరగాపాఱినను, మురికిగల ఆకారముతో ప్రవహించినను దానిమాహాత్మ్యము ఎన్నుటకు శక్యమా. (గాదనుట)

ఉ. దారుణపాతకాబ్ధికి స • దాబడబాగ్ని భవాకులార్తి వి
స్తారదవానలార్చికి సు • ధారసవృష్టి దురంతదుర్మతా
చారభయంకరాటవికిఁ • జండకఠోరకుఠారధార నీ
తారకనామ మెన్నుకొన • దాశరథీ కరుణాపయోనిధీ. 14

టీ. నీతారకనామము = సంసారమును తరింపఁజేయునట్టి నీయొక్క రామనామము, ఎన్నుకొనన్ = తలఁపఁగా, దారుణ = భయంకరమయిన, పాత

కి—పాపములనెడి, అబ్ధికిన్=సముద్రమునకు, సదా=ఎల్లప్పుడు, బడబా గ్ని=బడబాగ్నియైనది, భవ=సంసారముయొక్క, ఆకుల=వ్యాప్తమైయున్న ఆర్తి=పీడయొక్క, విస్తార=బాహుళ్యమనెడి, దవానల=కార్చిచ్చుయొ క్క, ఆర్చికిన్=సెగకు, సుధారసవృష్టి=అమృతవర్షము, దురంత=మి తిమీఱిన, దుర్మత=దుష్టమతములయొక్క, ఆచార=ఆచారములనెడి, భయంక ర=భయంకరమును కలిగించునట్టి, అటవికిన్=అడవికి, చండ=వేడిమిగల, క ఠోర=కటువయినదియు అగు, కుఠార=గొడ్డలియొక్క, ధార=మొన.

తా. సంసారతారకమయిన నీరామనామము బడబాగ్ని సముద్రమును పీల్చునట్లు భయంకరములయిన పాతకములను బోఁగొట్టును; అమృతవర్షము కార్చిచ్చును చల్లార్చునట్లు సంసార బాధలను ఉపశమింపఁజేయును. పదునయిన గొడ్డలిచే భయంకరమయిన అడవిని నఱుకునట్లు మితిమీఱిన దుర్మతాచారములను నిర్మూలము చేయును.

చ. హరునకు నవ్విభీషణున • కద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపద•కన్యకు నార్తి హరించుచుట్టమై
పరగినయట్టి నీపతిత • పావననామము జిహ్వపై నిరం
తరము నటింపఁజేయుమిఁక • దాశరథీ కరుణాపయోనిధీ. 15

టీ. హరునకున్=శివునకును, అవ్విభీషణునకున్=ఆవిభీషణునికిని, అ ద్రిజకున్=పార్వతికిని, తిరుమంత్ర రాజము=తిరు, శ్రీకరమైన, మంత్రరాజ ము=శ్రేష్ఠమయిన మంత్రము, ఐ=అయి, కరికిన్=ఏనుగునకును, అహల్య కున్=అహల్యకును, ద్రుపదకన్యకున్=ద్రౌపదికిని, ఆర్తిన్=దుఃఖమును హరించుచుట్టము=పోఁగొట్టునట్టి, బంధువు, అయి, పరగినయట్టి=ప్రసిద్ధి పొందినట్టి, నీ=నీయొక్క, పతిత=పతితులయినవారిని, పావన=పరిశుద్ధులను జేయునట్టి, నామము=పేరు, ఇఁకన్, జిహ్వపై=నాలుకమీఁద నిరంతర ము=ఎడతెగక, నటింపఁజేయుము=నృత్యము సేయునట్లు జేయుమా.

తా. దశరథరామా! శివునికిని, విభీషణునికిని, పార్వతికిని శ్రేష్ఠమయిన మంత్రమై; గజేంద్రునికి, అహల్యకును, ద్రౌపదికిని బంధువువలె చిక్కులను దొలఁగించినదై; పాపులను పవిత్రులను చేయునట్టి నీనామమును నానాలుకయందు నటించునట్లు చేయుమా.

ఉ. ముప్పునఁ గాలకింకరులు ♦ ముంగిట వచ్చిన వేళ రోగముల్
గొప్పరమైనచోఁ గఫము ♦ కుత్తుకనిండిన వేళ బాంధవుల్
గప్పినవేళ మీస్మరణ ♦ గల్గునొ గల్గదొ నాఁటికిప్పుడే
తప్పక చేతు మీభజన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 16

టీ. ముప్పునన్ = ముసలితనమునందు, కాలకింకరులు = యమదూతలు, ముంగిటన్ = ఇంటిముంగిటికి, వచ్చినవేళన్ = వచ్చినట్టిసమయమున, రోగముల్ = జబ్బులు, గొప్పరము = అతిశయించినవి, అయినచోన్ = అయినప్పుడును, కఫము, కుత్తుకన్ = కంఠమునందు, నిండినవేళన్ = పూర్ణమయిన సమయమందు, బాంధవుల్ = చుట్టములు, కప్పినవేళన్ = క్రమ్ముకొన్నప్పుడును, మీస్మరణ = మిమ్ములను ధ్యానించుట, నాఁటికిన్ = అప్పటికి, కల్గునో, కల్గదో యేమో, ఇప్పుడే, తప్పక = విడువక, మీభజన = మిమ్ముభజించుట, చేతున్ = చేయుదును.

తా. శ్రీరామా! వృద్ధాప్యమువచ్చి నేనున్నపోటికి యమదూతలు వచ్చినప్పుడు, రోగములు మిక్కిలి ఎక్కువైనప్పుడును, చావు సమీపింపఁగా కఫము గొంతుకయందు నిండియున్నపుడును, అప్పుడు బంధువులు చుట్టును క్రమ్ముకొని యుండఁగాను, మిమ్ము ధ్యానించుట నాకుఁ గలుగునో, కలుగదో చెప్పఁజాలను. కనుక ఇప్పుడే తప్పక నిన్ను భజనచేసెదను.

చ. పరమదయానిధే పతిత ♦ పావననామ హరే యటంచు సు
స్థిరమతులై సదాభజన ♦ సేయుమహాత్ములపాదధూళి నా
శిరమునదాల్తుమీరటకుఁ ♦ జేరకుఁడంచు యముండుకింకరో
త్కరముల కానఁబెట్టునఁట ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 17

టీ. పరమ=మిక్కిలి, దయా=కృపకు, నిధే=ఆస్థానమైనవాఁడా, పతిత=పాపాత్ములను, పావన=పవిత్రులనుగాఁ జేయునట్టి, నామా=పేరు గలవాఁడా, హరే=శ్రీహరీ, అటంచున్=అని, సదా=ఎల్లప్పుడును, సుస్థిర మిక్కిలి నిలుకడగల, మతులు=మనస్సుగలవారు, ఐ=అయి, భజన=భజించుట, చేయుమహాత్ముల=చేయునట్టి మహనీయులయొక్క, పాదధూళి= అడుగులదుమ్ము, నాశిరమునన్=నాతలయందు, తాల్తున్=ధరింతును, మీరు, అటకున్=వారికడకు, జేరకుఁడు=పోవకుఁడు, అంచున్=అనుచు, యముండు=యముడు, కింకరోత్కరములకున్=తన భటుల సమూహములకు, అనఁబెట్టునఁట=ఒట్టుఁబెట్టునని చెప్పుదురు.

తా. పాపాత్ములను పుణ్యులుగాఁ జేయునట్టి పేరుగలవాఁడా! హరీ అని ఎప్పుడును మిక్కిలినిలుకడగల మనస్సుగల వారయి కొలుచునట్టి మహాత్ములయొక్క పాదధూళి నాతలయందు ధరింతును. మీరు వారికడకు పోవకుఁడనుచు యముఁడు తన సేవకసమూహములకు ఒట్టుపెట్టునని చెప్పుదురు.

చ. అజునకుఁ దండ్రివయ్యు సన•కాదులకుం బరతత్త్వమయ్యు స
ద్ద్విజమునికోటికెల్లఁ గుల • దేవతవయ్యు దినేశవంశ భూ
భుజులకు మేటివయ్యుఁ బరి• పూర్ణుఁడవై వెలుఁగొందు పక్షిరా
డ్ధ్వజ మిముఁ బ్రస్తుతించెదను• దాశరథీ కరుణాపయోనిధీ. 18

టీ. అజునకున్=బ్రహ్మకు, తండ్రివయ్యున్=తండ్రివిగాను, సనకాదులకున్=సనకుఁడు, సనందనుఁడు మొదలయినవారికి, పరతత్త్వము అయ్యున్=గొప్పవస్తువుగాను, సత్=శ్రేష్ఠులయిన, ద్విజ=బ్రాహ్మణుల యొక్క, ముని=ఋషులయొక్క కోటికిన్ ఎల్లన్=సమూహమునకు, పరదేవత వు అయ్యు=శ్రేష్ఠమయిన దైవముగాను, దినేశ=సూర్యునియొక్క, వంశ= కులమందలి, భూభుజులకున్=రాజులకు, మేటివయ్యున్=గొప్పవాడవుగాను,

పరిపూర్ణుఁడవు=నిండినవాఁడవు, ఐ=అయి, వెలుఁగొందు=ప్రకాశించుచున్న, పక్షిరాడ్ధ్వజ=పక్షులకెల్ల రాజైన గరుత్మంతుఁడు, వాహనముగాఁ గలవాఁడా, మిముఁ=మిమ్ము, ప్రస్తుతించెదను=మిక్కిలి స్తోత్రముచేసెదను.

తా. బ్రహ్మయు చంద్రివిగాను, సనకసనందనాది మహాత్ములు ధ్యానము సేయు పరతత్వముగాను, విప్రముని సమూహములు కొలుచునట్టి పరమైనముగాను, ఇట్లు అన్నిలక్షణములను గలవాఁడవై గరుడుఁడు ధ్వజముగాఁ గలిగి ప్రకాశించు దయానిధీ నిన్ను మిక్కిలి పొగడెదను.

ఉ. "పండితరక్షకుం డఖిల • పాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశ • కంఠవిలుంఠన చండకాండకో
దండకలాప్రవీణుఁ" డను • తావకకీర్తివధూటికిత్తుఁ బూ
దండలగాఁగ నాకవిత • దాశరథీ కరుణాపయోనిధీ. 19

టీ. పండితరక్షకుండు=పండితులను రక్షించువాఁడు, అఖిలపాప=సమస్తపాపములనుండి, విమోచనుఁడు=విడిచిపుచ్చువాఁడు, అబ్జసంభవ=బ్రహ్మచేతను, ఆఖండల=ఇంద్రునిచేతను, పూజితుండు=పూజింపఁబడువాఁడు, దశకంఠ=రావణాసురుని పదితలలను, విలుంఠన=కొల్లగొనుటచేత, చండ=తీక్ష్ణమయిన, కాండ=బాణములుగల, కోదండకలా=విలువిద్యయందు, ప్రవీణుఁడు=నేర్పరియైనవాఁడు, అను=అనెడి, తావక=నీయొక్క, కీర్తి=యశస్సనెడి, వధూటికిన్=స్త్రీకి, నాకవిత=నాకవిత్వమును, బూదండలు గాఁగ=పూలదండలు అగునట్లుగా, ఇత్తున్=ఇత్తును.

తా. కరుణాసముద్రుడవయిన రామా! పండితులను రక్షించువాఁడు, సమస్తపాపములను తొలగించువాఁడు, బ్రహ్మేంద్రాదులచే పూజింపఁబడువాఁడు, రావణాసురుని తలలునరుకునట్టి వాఁడిబాణములను వేయనేర్చిన విలువిద్యలయందు నేర్పరియైనవాడు, అనెడు నీకీర్తికి నా కవిత్వమునుఇచ్చి ఒకపడఁతికి పూదండలిచ్చి యలంకరింపఁజేసినట్లు ఆకీర్తిని ప్రకాశింపజేయుదును.

ఉ. శ్రీరమ సీతగాఁగ నిజ • సేవక బృందము వీరవైష్ణవా
చారజనంబుగాఁగ విర • జానది గౌతమిగా వికుంఠము
న్నారయభద్రశైల శిఖ • రాగ్రముగాఁగ వసించుచేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు • దాశరథీ కరుణాపయోనిధీ. 20

టీ. శ్రీరమ=లక్ష్మీదేవి, సీతగాఁగ=సీతాదేవిగాఁగా, నిజ=స్వంత సేవకబృందము=పరిజనులసమూహము, వీరవైష్ణవ, ఆచార=ఆచారముగల, జనంబుగాఁగ=జనులుగాఁగా, విరజానది, గౌతమిగాఁగ=గోదావరిగాఁగా, వికుంఠముఁ=వైకుంఠమును, ఆరయఁ=విచారింపఁగా, భద్రశైల=భద్రాచలముయొక్క, శిఖర=శిఖరముయొక్క, అగ్రముగాఁగ=కొనగాఁగా వసించి=నెలకొని, చేతనోద్ధారకుఁడు=జనులను ఉద్ధరించువాఁడు, ఐన, విష్ణుఁడవు=అయినట్టి సాక్షాద్విష్ణుదేవుఁడవు.

తా. దశరథరామా! నీవు స్వర్గమందున్న లక్ష్మీదేవిని ఇచట సీతగాఁ జేసికొని అందలి సేవకులను ఇచ్చటవీరవైష్ణవజనులుగా వచ్చి కొలుచుచుండఁగా అచట విరజానది ఇచట గోదావరిగా ప్రవహింపఁగా, ఆవైకుంఠమే యిచట భద్రగిరి కొమ్ముకొనయై రాణింపఁగా వేంచేసి జనులను ఉద్ధరించుచున్న శ్రీవిష్ణుదేవుఁడవేకాని వేఱుకావు.

ఉ. కంటి నదీతటంబుఁ బొడఁ • గంటిని భద్రనగాధివాసముం
గంటినిలాత్మనూజ నురు • కార్ముక మార్గణశంఖచక్రముల్
గంటిని మిమ్ములక్ష్మణునిఁ • గంటిఁ గృతార్థుడనైతినో జగ
త్కంటక దైత్యనిర్దళన • దాశరథీ కరుణాపయోనిధీ. 21

టీ. జగత్=లోకములకు, కంటక=హింసించువారైన, దైత్య=రాక్షసులను, నిర్దళన=సంహరించువాఁడా, కరుణాపయోనిధీ, దాశరథీ, నదీతటంబు=నదియొక్కతీరమును, కంటిఁ=చూచితిని, భద్రనగాధివాసముఁ=భద్రాచలముఅనెడి, నివాసస్థానమును, కంటిఁ=చూచితిని, ఇలాత్మనూజఁ=

భూదేవి కూతురయిన సీతాదేవిని, కంటిన్ - చూచితిని, ఉరు=గొప్పదైన, కార్ముక - విల్లు, మార్గణ - బాణములు, శంఖచక్రములన్ = శంఖమును చక్రమును, కంటిని= చూచితిని, కృతార్థుడను= ధన్యుడను, ఐతిన్ - అయితిని.

తా. లోకహింసకులైన రాక్షసులను చంపి, దయాసముద్రుఁడవై యొప్పు శ్రీరామా! నీవు వేంచేసియున్న భద్రగిరియొద్దనున్న గోదావరిగట్టును, నీవు వేంచేసియున్న భద్రాచలమును, సీతాదేవిని, నీవిల్లును, బాణములను, శంఖచక్రములను, నిన్నును, లక్ష్మణుని సేవించి కృతార్థుఁడనైతి.

చ. హలికునకున్ హలాగ్రమున • నర్థము సేకురుభంగి దప్పిచే
నలమటఁజెందువానికి సు • రాపగలో జలమబ్బినట్లు దు
ర్మలిన మనోవికారినగు • మర్త్యుని నన్నొడఁగూర్చి నీపయిం
దలఁపు ఘటింపజేసితివి • దాశరథీ కరుణాపయోనిధీ. 22

టీ. దాశరథీ, హలికునకున్ - మడఁక దున్నువానికి, హలాగ్రమునన్ - నాఁగలి మొనయందు, అర్థము - ధనము, సేకురుభంగిన్ = లభించిన విధమున, దప్పిచేన్ = దాహముచేత, అలమటన్ = బడలికను, చెందువానికి= పొందువానికి, సురాపగలోన్ = గంగలో, జలము= నీరు, అబ్బినట్లు=దొరికినవిధమున, దుర్మలిన= మిక్కిలిదోషయుక్తమైన, మనః=మనస్సుయొక్క. వికారిని=వికారములుగలవాఁడను, అగుమర్త్యున్ =అయినమనుష్యుని, నన్నున్, ఒడఁగూర్చి= సవరించి, నీపయిన్ =నీమీద, తలఁపు=చింతనము, ఘటింపఁజేసితివి=కలుగఁజేసితివి.

తా. మడఁకదున్నుకొను పేదకు మడఁకముంగల భూమిలో ధనము దొరకినట్లును, దప్పిగొని బడలినవానికి గంగానదిలోని నీరుదొరకినట్లును, దుష్టమనస్సుగల మనుష్యుండనైన నన్ను చక్కఁజేసి నీపయి తలఁపుగలిగించి ధన్యుని జేసితివి.

ఉ. కొంజక తర్కవాదమను • గుద్దలిచే బరతత్త్వభూస్థలిన్
రంజిలఁద్రవ్వి కన్గొనని • రామనిధానము నేఁడు భక్తిసి

ద్ధాంజనమందు హస్తగత • మయ్యెబళీయనఁగా మదీయహృ
త్కంజమునన్ వసింపుమిఁక • దాశరథీ కరుణాపయోనిధీ. 23

టీ. కొంజక=సంకోచింపక, తర్కవాదము=తర్కముచేయు వివాదము, అను గుద్దలిచేత, పరతత్త్వభూస్థలిన్=పరతత్త్వముఅనెడిభూప్రదేశమును, రంజిలన్ఒప్పఁగా, త్రవ్వి, కన్గొనని రామనిధానము=చూడలేని రాముఁడు అనెడినిధి, నేఁడు=ఇపుడు, భక్తిసిద్ధాంజనమందు=భక్తియనెడి సిద్ధకృతమైన కాటుకయందు, హస్తగతము=చేతికిదొరికినది, అయ్యెన్ = అయెను, అనగాన్=అనునట్లు, ఇకన్=ఇకమీఁద, భక్తిచేత, మదీయహృత్కంజమునన్=నాహృదయకమలమందు, వసింపుము=నెలకొనుము.

తా. భూమిని గుద్దలిచేత్రవ్వినను కనఁబడని నిధి అంజనముచేలభించునట్లు, పరతత్త్వ తర్కవాదములచే ఎంతపరిశీలించినను అందు తెలియరాని రాముఁడవగు నీవు భక్తిచే సులభముగా నాకువశ్యుడవైతివి. ఇఁక నా హృదయమునందు వసింపుమా.

ఉ. రాముడు ఘోరపాతక వి • రాముఁడు సద్గుణకల్పవల్లికా
రాముఁడు షడ్వికారజయ • రాముఁడు సాధుజనావనవ్రతో
ద్దాముఁడు రాముఁడేపరమ • దైవముమాకని మీఁయడుంగు గెం
దామరలే భజించెదను • దాశరథీ కరుణాపయోనిధీ. 24

టీ. రాముఁడు=రమింపఁజేయువాఁడు, ఘోర = భయంకరములైన, పాతక=పాతకములను, విరాముఁడు=తొలగించువాఁడు, సద్గుణ=మంచిగుణములు అనెడి, కల్పవల్లికా=కల్పవృక్షపుతీఁగలకు, ఆరాముఁడు=తోఁటయైనవాఁడు, (సజ్జనకల్పవల్లికారాముడు) షడ్వికార=పుట్టుట పెరుగుట మొదలయిన ఆఱువికారములయొక్క, జయ=గెలుపుచేత, రాముఁడు=మనోజ్ఞుఁడయినవాఁడు, సాధుజన=సజ్జనులను, అవన=రక్షించుటఅనెడి, వ్రత=నియమముచేత, ఉద్దాముఁడు=అధికుఁడయినవాఁడు శ్రీరాముఁడే=శ్రీరాముఁడేమా

డు, పరమదైవము, అని, మీఅడుంగు కెందామరలను=మీపాదములనెడి ఎఱ్ఱతామరలను, ఏను=నేను, భజించెదను=పూజించెదను.

తా. సకలజనులను రమింపఁజేయువాఁడును, ఘోరమయిన పాపములను పారఁదోలువాఁడును, కల్యాణగుణములను గలవాఁడును, వికారరహితుఁడై ప్రకాశించువాఁడును, సాధుజనులను రక్షించునట్టివాఁడును, రాముఁడేమాకు పరమదైవమని మీపాదారవిందములను భజించెదను.

ఉ. చక్కెరమాని వేముదినఁ • జాలినకైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవములఁ • వేమఱుఁ గొల్చెద రట్లఁ గాదయా
మ్రొక్కిననీక మ్రొక్కవలెఁ • మోక్షమొసంగిననీవ యీవలెం
దక్కిన మాట లేమిటికి • దాశరథీ కరుణాపయోనిధీ. 25

టీ. చక్కెరన్=పంచదారను, మాని=విడిచి, వేమున్=వేపఁచెట్టును, చేదును, తినన్=తినుటకును, చాలినకైవడిన్=నేర్చినవిధమున, మానవాధముల్=హీనులు, పెక్కురు=అనేకులు, బక్కదైవములన్=చిన్నదేవతలను వేమఱున్=పలమాఱు, కొల్చెదరు=సేవించెదరు, అట్లు=ఆవిధపు, కాదయా=కాదు. మ్రొక్కినన్=మ్రొక్కినయెడల, నీక=నీకే మ్రొక్కవలెన్=నమస్కరింపవలెను. మోక్షము=ముక్తిని, ఒసంగినన్=ఇచ్చినను, నీవ=నీవే ఈవలెన్=ఇయ్యవలెను, తక్కినమాటలు=ఇతరవిషయములు. ఏమిటికిన్=ఎందుకు.

తా. హీనులైనవారు అనేకులు నిన్నువదలి దేవతల నేకములను గొలిచెదరు. అనగా తియ్యనిచక్కెరను విడిచి చేఁదైనవేమును దినుటకు నేర్చినట్లున్నది. ఇది సరికాదు. మ్రొక్కదగినవాఁడవు నీవే మోక్షమిచ్చువాఁడవు నీవే.

ఉ. 'రా'కలుషంబులెల్ల బయఁ • లంబడఁద్రోచిన 'మా'కవాటమై
దీకొనిప్రోచునిక్కమని • ధీయుతు లెన్నఁదదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువఁ • గానరు గాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల • దాశరథీ కరుణాపయోనిధీ. 26

టీ. "రా"- "రామ"అనెడి పేరునందలి రేఫము, కలుషంబులెల్లన్= దోషములను అన్నిటిని, బయలన్=వెలుపల, పడన్ ద్రోయఁగాన్=పడునట్లు త్రోసివేయఁగా, "మా"="మ"అను అక్షరము, కవాటమై=తలుపై, దీనోని=తాఁకి, ప్రోచున్=కాపాడును, నిక్కము=ఇదినిజము, అని, ధీ=బుద్ధితోడ, యుతులు=కూడినవారు, జ్ఞానులు, ఎన్నన్=తలఁపగా, తదీయవర్ణముల్=అయక్షరములను, కైకొని=చేకొని, గ్రహించి, భక్తిచే=భక్తిపూర్వకముగా, నుడువన్=చెప్పుటను, కానరు=తెలియరు, కాక=కానివో, విపత్ ఆపదలయొక్క, పరంపరల్=ఎడతెగని పంక్తులు, జగత్ + జనులన్=జగమునందలి వారిని (లోకులననుట,) పైకొనునే=ఆక్రమించునా.

తా. "రామ"అను దివ్యనామములోని రేఫము పాపములనన్నిటిని బయటికిఁ పారదోలఁగా "మ" అనెడి అక్షరముతలుపువలె అడ్డపడి వానిని ఎదిరించి లోపలకి రాకుండునట్లు జేసి ఆశ్రితులను కాపాడును. ఇది నిజమని జ్ఞానవంతులు చెప్పఁగా మూఢులాయక్షరములను గ్రహించి ధ్యానింపనేరకున్నారు. ఇట్లుకాక లోకులు వానిని జపించిరేని యెడతెగక వచ్చు ఆపదలు వారికి కలుగవు.

ఉ. రామహరే కకుత్థ్సకుల • రామహరే రఘురామరామశ్రీ
రామ హరేయటంచు మది • రంజల భేకగళంబులీల నీ
నామము సంస్మరించిన జ • నంబు భవంబెడఁబాసి తత్పరం
ధామనివాసులై దురఁట • దాశరథీ కరుణాపయోనిధీ. 27

టీ. రామ=రామా, హరే=హరీ, కకుత్థ్సకులరామ=కాకుత్స్థవంశమున పుట్టినరామా, హరే=హరీ, రఘురామ=రఘురాజు సంతతివాఁడవైన రామా, రామ=రామా, శ్రీరామ=శ్రీరామా, హరే=హరీ, అటంచున్=అని, మది=మనస్సు, రంజిలన్=సంతోషించునట్లు, భేక=కప్పయొక్క, గళంబులీలన్=గొంతువిధమున, స్మరించిన జనంబు=మనస్సులో తలంచిన జనులు, భవంబు=జన్మములు, ఎడబాసి=విడిచి- తత్=అప్రసిద్ధమైన, పరం

ధామ- శ్రేష్ఠమైనపట్టు అగుపరమపదమునందు, నివాసులు- నివసించువారు, కాఁగలరు అంట- అగుదురు.

తా. రామ! హరే! కౌసల్యారామ! రఘురామ! శ్రీరామ! హరే! అను నీనామమును కప్పగొంతుపలె మనస్సున మాటిమాటికిఁ దలంచు జనులు ఇఁక జన్మమెత్తుటను విడిచి పరమపదమందు వసింతురుగదా.

ఉ. చక్కెరలప్పకుఁ మిగుల • జవ్వని కెంజిగురాకు మోవికిం
జొక్కపుఁజుంటి తేనియకుఁ • జొక్కిలుచుండఁగ లేరు గాక నే
డక్కట రామనామమధు • రామృతమానుటకంటె సౌఖ్యమా
తక్కిన మాధురీమహిమ • దాశరథీ కరుణాపయోనిధీ. 28

టీ. చక్కెరలప్పకుఁ= పంచదారయొక్క రాశికిని, జవ్వని,- యౌవనముగల స్త్రీయొక్క, కెంపు+చిగురాకు మోవికిఁ = ఎఱ్ఱనిచిగురువంటి అధరమునకు, చొక్కపు జుంటితేనియకుఁ= అచ్చమైన జుంటీఁగలుగూర్చిన తేనెకును, మిగులఁ = మిక్కిలి, చొక్కిలుచుఁ = చొక్కుచు, కనలేరుగాక= (రామనామముయొక్క మాధుర్యమును) తెలిసికొనలేరుగాని, అక్కట రామనామ= రామ అనెడి నామముయొక్క, మధుర= తీయనైన అమృతమున అనుటకంటెఁ= ఆస్వాదించుటకంటెను, తక్కిన= ఇతరమైన, మాధురీ= తీపియొక్క, మహిమ = పేరిమి, సౌఖ్యమా= సుఖమైనదా.

తా. రామా! చక్కెరరాశికి, ఎల్లప్రాయముగల స్త్రీల చిగురాకు వంటి యొప్పని పెదవికిని, తేనెటీఁగలు గూర్చిన అచ్చతేనెను చొక్కి రామ నామముయొక్క మాధుర్యమును తెలిసికొనక జనులున్నారుగాని, అమృతము వలె అతిభోగ్యమైన రామనామమును స్మరించుట కంటెను తక్కినవాని మాధుర్యాతిశయము సుఖప్రదము కానేరదు. రామనామమే అన్నిటికంటె మధురమయినది.

ఉ. అండజవాహనిన్ను హృద • యంబున నమ్మిన వారిపాపముల్
కొండలవంటివైన వెసఁ • గూలి నశింపక యున్నె సంతతా

ఖండలవైభవోన్నతులు • గల్గకమానునె మోక్షలక్ష్మికై
దండయొసంగకున్నె తుద • దాశరథీ కరుణాపయోనిధీ 29

టీ. అండజవాహా=పక్షివాహనా, నిన్నున్, హృదయంబునన్=మనస్సునందు, నమ్మినవారిపాపముల్=నమ్మినట్టి వారలయొక్క పాపములు, కొండలవంటివి=కొండలవలె మిక్కిలి గొప్పరాసులయినవి, ఐనన్=అయినను వెసన్=త్వరితముగా, కూలి=క్రిందపడి, నశింపకయున్నె=చెడిపోకయుండు నా, సంతత=ఎడతెగనట్టి, ఆఖండల=ఇంద్రునియొక్క, వైభవ=విభవము యొక్క, ఉన్నతులు=అతిశయములు, కల్గకమానునె=లభింపకపోవునా తుదన్=చివర, మోక్షలక్ష్మి=ముక్తిరూపమైనలక్ష్మి, కై=కొఱకు, దండ=సాహాయ్యము, ఒసంగక ఉన్నె=ఇయ్యకుండునా.

తా. పక్షివాహనా! మనసునందు నిన్ను నమ్మినవారికి మొదట కొండలవలె పెద్ద తప్పులు గొనియున్న వారిపాపములు నశించిపోక మానవు. ఇంద్రుని యైశ్వర్యమువంటి మహదైశ్వర్యము కలుగకపోదు. పిమ్మట మోక్షము లభింపకపోదు.

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ • జెందినమీఁగడ పంచదారతో
మెక్కినభంగి మీవిమల • మేచకరూపసుధారసంబు నా
మక్కువపళ్ళెరంబున స • మాహితదాస్యమనేటిదోయిటన్
దక్కెనటంచు జుర్రెదను • దాశరథీ కరుణాపయోనిధీ. 30

టీ. చిక్కనిపాలపైన్=చిక్కనగు పాలమీఁద, మిసిమిజెందినమీగడన్ మిసిమిన్=కాంతిని, = చెందిన=పొందిన, మిసమిసలాడునట్టిదియు ననుట, మీఁగడన్=మీఁగడను, పంచదారతోన్=చక్కెరతోడఁగూర్చి, మెక్కిన భంగిన్=తిన్నవిధమున, మీ=మీయొక్క, విమల=అచ్ఛమయిన, మేచక=నల్లని, రూప=ఆకారము అనెడి, సుధారసంబు=అమృతరసమును, నా=నా యొక్క, మక్కువ=ప్రేమయనెడి, పళ్ళెరంబునన్=భోజనపాత్రమున, సమా

హిత= హెచ్చరికగల, దాస్యము= కొలువు, అనేటి= అనునట్టి, నోయిటన్= దోసిలియందు, దక్కెను= లభించెను, అటంచున్= అనుచు, జుఱ్ఱెదను= జుఱ్ఱుచున్నాను.

తా. చిక్కనిపాలమీఁద మిసమిసలాడు మీఁగడను చక్కెరతోఁ గలిపి తినునట్లు మిక్కిలి అమృత రసమువలెనుండు నీవల్లనిరూపమును నేను ప్రేమతోఁ గైకొని దాస్యరూపమైన కైంకర్యమును అవలీలగా చేసి అనుభవించెదను.

చ. సిరులిడ సీత, పీడలెగ • జిమ్ముటకున్ హనుమంతుఁడార్తిసో
దరుఁడుసుమిత్రసూతిదురితంబులుమాపుప రామనామమున్
గరుణదలిర్ప మానవులఁ • గావఁగఁ బన్నిన వజ్రపంజరో
త్కరముగదా భవన్మహిమ • దాశరథీకరుణాపయోనిధీ 31

టీ. సిరులు=సంపదలు, ఇడన్= ఇచ్చుటను, సీత=సీతాదేవి, పీడలు= బాధలు, ఎగఁజిమ్ముటకున్=అవలీలఁ బోఁగొట్టుటకు, హనుమంతుఁడు=అంజనేయుఁడు, అగును, ఆర్తిన్=సంకటమునందు, సోదరుఁడు=తోఁబుట్టువు, సుమిత్రసూతి= లక్ష్మణుఁడు, దురితంబులు= పాపములను, మాపన్=పారదోలుటకు, రామనామమున్=రామ అనెడి నీనామమును, అగును, కరుణ= దయ, తలిర్పన్=మీఱఁగా, మానవులన్=మనుష్యులను, కావన్=కాపాడుటకు, పన్నిన=చేసిన, వజ్ర=వజ్రముచేతనైన, పంజర=గూండ్లయొక్క ఉత్కరము=సమూహము, భవత్+మహిమ=నీమాహాత్మ్యము.

తా. దశరథరామా! సిరులిచ్చుటకు నీభార్యయయిన సీతాదేవియు బాధలను తొలగించుటకు భృత్యుఁడైన హనుమంతుఁడును, సంకటములందు తోఁడబుట్టువువలె పచరించుటకు నీతమ్ముఁడగులక్ష్మణుఁడును పాపములతొలగించుటకు నీనామమును, చిలుకలు మొదలయినవానిని వజ్రపుఁగూళ్లలో పెట్టి కాపాడునట్లు మనుష్యులను కాపాడుటకు నీ మహాత్మ్యమును గలదు.

చ. హాలకులిశాంకుశధ్వజశ • రాసన శంఖరథాంగ కల్పకో
జ్జ్వలజలజాతరేఖలను • సాంకములై కనుపట్టుచున్న మీ
కలితపదాంబుజ ద్వయము • గౌతమపత్ని కొసంగినట్లు నా
తలపునఁ జేర్చి కావఁగదె • దాశరథీ కరుణాపయోనిధీ 32

టీ. హల=నాఁగేలు, కులిశ=వజ్రాయుధము, అంకుశ=అంకుశము, ధ్వజ=టెక్కెము, శరాసన=విల్లు, శంఖ=సంకువు, రథాంగ=చక్రము, కల్పక=కల్పవృక్షము, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, జలజాత=తామర, ఇవి యనెడి, రేఖలను=రేఖలచేత, సాంకములు=గురుతులతోఁగూడినవి, ఐ=అయి, కనుపట్టుచున్న=అగపడుచున్న, మీ=మీయొక్క, కలిత=ఒప్పుచున్న, పద అంబుజ=అడుగుదమ్ములయొక్క, ద్వయము=జతను, గౌతమపత్నికిన్=గౌతమునిభార్యయగు అహల్యకు, ఒసంగినట్లు, నాతలపునన్=నాచిత్తమందు, చేర్చి=కూర్చి, కావన్ కదె=రక్షింపుమా.

తా. అహల్యకు నాఁగేలు, వజ్రాయుధము, అంకుశము మొదలయిన వానిరూపములు గల రేఖలు దాల్చియున్న మీపాదారవిందములను ఇచ్చి ఆమెను కృతార్థురాలినిగా చేసినట్లు నాహృదయమునందు చేరి నన్ను కృతార్థునిగా చేయుమా.

చ. జలనిధిలోనదూఁటి కుల • శైలముమీటిధరిత్రిఁగొమ్మునం
దలవడ మాటి రక్కసుని • యంగముగీటిబలీంద్రునిన్ రసా
తలమున మాటిపార్థివక • దంబముగూల్చిన మేటిరామ నా
తలఁపుననాటి రాఁగదవె • దాశరథీ కరుణాపయోనిధీ. 33

టీ. జలనిధిలోనన్ - సముద్రములోపల, దూఁటి=చొచ్చి, కులశైలమున్=కులపర్వతమును, మీటి=యెత్తి, ధరిత్రిన్=నీళ్ళలో మునిఁగియుండినభూమిని, కొమ్మునను, అలవడన్=పొందికగా, మాటి=తగిల్చి రక్కసుని యంగము=రాక్షసుండైన హిరణ్యకశిపుని శరీరము, గీటి=చీల్చి,

బలీంద్రునిన్ - ఇంద్రుండుగానుండిన, బలిచక్రవర్తిని, రసాతలమునన్ - రసాతలమందు, మాటి= దాచి, పార్థివకదంబమున్ — పార్థివ=రాజుల యొక్క, కదంబమున్=సమూహమును, కూల్చిన= నాశనముచేసినట్టి, మేటి= దిట్టడవయిన, రామ=రామచంద్రా, నాతలంపునన్ — నాచింతనమందు, నాటి= నెలకొని, రాగదవె=రమ్మా.

తా. శ్రీరామా! చేపవై సోమకాసురుని కొఱకు సముద్రముఁజొచ్చి, తాబేలయి మందర పర్వతమును పాలసముద్రములో మునిఁగిన దానిని ఎత్తి నిలిపి, వరాహమవై ప్రళయజలములలో రసాతలమునంటిన భూమిని కోఱ కొమ్మున నెత్తికొనివచ్చి, నరసింహుఁడవై హిరణ్యకశిపుని దేహము చించి, వామనుఁడవై బలిచక్రవర్తిని రసాతలమునకు అడఁగఁద్రొక్కి, పరశురాముఁడవై రాజసమూహమును సంహరించినట్టి నీవు నామనసునందు స్థిరముగా నిలిచి యుండుమా.

ఉ. భండనభీముఁ డార్తజన • బాంధవుఁ డుజ్జ్వల బాణతూణకో
దండకళాప్రచండభుజ • తాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదైవ మిఁక • లేఁడనుచున్ గడగట్టి భేరికా
డాండడ డాండ డాండనిన • దంబులు జాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను • దాశరథీ కరుణాపయోనిధీ. 34

టీ. భండన=యుద్ధమందు, భీముఁడు=భయంకరుఁడు, ఆర్తజన= భయమునొందినవారి సమూహమునకు, బాంధవుఁడు=చుట్టము, ఉజ్జ్వల= ప్రకాశించుచున్న, బాణ=బాణములును, తూణ=పొదలునుగల, కోదండ కళా=విలువిద్యయందు, ప్రచండ=ఎక్కువయిన భుజ=బాహువులయొక్క, తాండవ=నటనముచేతఁగలిగిన, కీర్తికిన్=యశస్సుగలవాఁడగు, రామమూర్తికిన్=రామచంద్రునికి, రెండవసాటిదైవము=సమానమైన మఱియొకదైవము, ఇఁకన్=ఇఁకను, లేఁడనుచున్, గడగట్టి=స్తంభమునాటి, భేరికా= భేరియొక్క, దాండడదాండదాండ=దాండ దదాండదాండ అనెడి,నినదంబులు

శబ్దములు, అజాండమును=బ్రహ్మాండమును, నిండఁగ=నిండునట్లు, మదద్వేదండము=మదించిన యేనుగును, ఎక్కి, చాటెదను=ప్రకటించెదను.

తా. రాముఁడు శత్రువులకు యుద్ధమందు భయంకరుఁడు; భక్తులకు బంధువువంటివాఁడు. కావున బాణములను అమ్ముల పొదులును ప్రకాశించుచున్న విలువిద్యనెఱపు తీవ్రమయిన భుజముల లాఘవముచే పొగడ్తగన్న శ్రీరామమూర్తికి సాటిదైవము మఱియొకటి లేదనుచు బ్రహ్మాండము నిండునట్లు ఢాం ఢాం అని భేరి గొట్టుచు మదపుటేనుగునెక్కి చాటెదను.

చ. అవనిజకన్నుదోయి తొగ • లందు వెలింగెడుసోమ జానకీ
కువలయనేత్రిగబ్బిచనుఁ • గొండల నుండుఘనంబు మైథిలీ
నవనవయౌవనం బను వ • నంబునకున్ మదదంతివీవె కా
దవిలి భజింతు నెల్లపుడు • దాశరథీ కరుణాపయోనిధీ. 35

టీ. అవనిజ=సీతయొక్క, కన్నుదోయి=రెండు కన్నులనెడు, తొగలందు=కలువపూవులయందు, వెలింగెడుసోమ=ప్రకాశించుచున్న చంద్రుఁడైనవాఁడా, జానకీ=జనకుని కూతురైన సీత అనెడి, కువలయనేత్రి=కలువపూవులవంటి కన్నులు గల, గబ్బి=ఉబ్బులయిన, చనుగొండలన్, ఉండు ఘనంబు=ఉండునట్టిమేఘము, మైథిలీ=మిథిలరాజు కూఁతురయిన సీతాదేవియొక్క, నవనవ=మిక్కిలి క్రొత్తయయిన, యౌవనంబు=ప్రాయము, అను వనంబునకున్=అనుతోఁటకు, మదదంతివి=మదించిన యేనుఁగవు, నీవె కాన్=నీవే అని, తవిలి=ఆసక్తిగాని, ఎల్లప్పుడున్=అన్నివేళల భజింతున్=సేవింతును.

తా. రామా! నిన్ను సీతాదేవి కన్నుదోయి యనెడి కలువలను వికసింపఁజేసెడు చంద్రుఁడుగాను, జానకీదేవి యుబ్బుచన్నులనెడి కొండల యందుండు నీలమేఘము గాను, మిథిలాధిపతిపుత్రి యౌవనమను తోఁటకు మదపుటేనుఁగుగాను, తలఁచి ఎప్పుడును నిన్నే సేవించెదను.

చ. ఖరకరవంశజా విను మఖండితభూతపిశాచ ఢాకినీ
జ్వరపరితాపసర్పభయ • వారకమైన భవత్పదాబ్జ వి
స్ఫురదురువజ్రపంజరముఁ • జొచ్చితి నీయెడదీనమానవో
ద్ధరబిరుదాంక యేమఱకు • దాశరథీ కరుణాపయోనిధీ. 36

టీ. ఖరకర=సూర్యునియొక్క, వంశ=వంశమునందు. జా=పుట్టిన వాఁడా, అఖండిత=కొట్టఁబడని, భూత=భూతములు, పిశాచ=పిశాచములు, ఢాకినీ=ఢాకినులు, జ్వర=జ్వరములు, పరితాప=తాపములు, సర్ప=సర్పములు, భయ=భయములను, వారక=పోఁగొట్టునది, • అయిన=అయినట్టి, భవత్=నీయొక్క, పదాబ్జ=పాదపద్మముల నెడి, విస్ఫురత్=మిక్కిలి ప్రకాశించుచున్న, ఉరు=గొప్పయయిన, వజ్రపంజరమున్=వజ్రముతోఁ జేయబడిన గూటిని, జొచ్చితిని=ప్రవేశించితిని, నీయెడన్=నీ యందు, దీన=దీనులయిన, మానవ=జనులను, ఉద్ధర=ఉద్ధరించువాఁడ నెడి, బిరుద+అంకము=బిరుదరూపమయిన చిహ్నము, ఏమఱకు పోఁగొట్టకుము.

తా. సూర్యవంశమునఁబుట్టిన శ్రీరామా! భూతములు, పిశాచములు ఢాకినులు, తాపములు, సర్పములు మొదలగు వానివలని భయమును పోఁగొట్టునదై వజ్ర పంజరమువలె రక్షించు నీచరణారవిందముల నాశ్రయించి చొచ్చితిని. నీవుదీన మానవపోషకుఁడను బిరుదుగలవాఁడవు కాబట్టి నన్ను ఉద్ధరింపనివాఁడవై యీబిరుదును బోఁగొట్టుకొనకుమా.

ఉ. జుఱ్ఱెద మీకథామృతము • జుఱ్ఱెద మీపదకంజతోయమున్
జుఱ్ఱెద రామనామమున • జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుఱ్ఱెద జుఱ్ఱజుఱ్ఱఁగ రు • చుల్ గనువారిపదంబుఁ గూర్పవే
తుఱ్ఱులతోడి పొత్తిడక • దాశరథీ కరుణాపయోనిధీ. 37

టీ. మీకథామృతము=మీయొక్క కథలనెడి, యమృతమును, జుఱ్ఱెద=జుఱ్ఱుచున్నాను. మీపదకంజ=మీపాదారవిందములయొక్క, తోయ

ముల్ = జలమును, జుర్రెదన్ = జుఱ్ఱుచున్నాను, రామనామమునన్ = రామనా
మమునందు, జొబ్బిలుచున్న సుధారసంబు = స్రవించుచున్న అమృతరసమును
జుర్రెదన్ = జుఱ్ఱుచున్నాను. జుఱ్ఱుజుఱ్ఱుఁగన్ = జుఱ్ఱుఁగాజుఱ్ఱుఁగా, రుచుల్ = చ
వులు, కనువారి = ఎఱిఁగినట్టివారియొక్క, పదంబులన్ = స్థానమును, ప్రియులతో
డిపొత్తు = అల్లులతో స్నేహము, ఈయక = పెట్టక, కూర్పవే = చేర్పుమా.

తా. శ్రీరామా! నీచరిత్రములనెడి యమృతమును, నీపాదతీర్థమును, నీ
నామమునందు స్రవించుచున్న యమృతమును జుర్రెదను. నీ చరిత్రాదుల య
మృతమును జుఱ్ఱి రుచిదెలిసికొనిన మహాత్ముల దివ్యగతిని నాకుఁగల్గింపుము.
నీచులతోడి పొందుమాన్పుము.

ఉ. ఘోరకృతాంతవీరభట • కోటికి గుండెదిగుల్ దరిద్రతా
కార పిశాచసంహరణ • కార్యవినోది వికుంఠమందిర
ద్వారకవాటభేది నిజ • దాసజనావళి కెల్లప్రొద్దు నీ
తారకనామ మెన్నుకొన • దాశరథీ కరుణాపయోనిధీ 38

టీ. నీతారకనామము = సంసారమును దాఁటజేయు నీనామమును, ఎన్ను
కొనన్ = తలఁచుకొనఁగా. ఘోరభయంకరుఁడైన, కృతాంత = యమునియొక్క
వీర = శూరులైన, భటకోటికిన్ = కింకరులసమూహమునకు, గుండెదిగుల్ =
గుండెలోనిభయము, దరిద్రతా = దారిద్ర్యముయొక్క, ఆకార = రూపముగల,
పిశాచ = పిశాచమును, సంహరణ = చంపుటయనెడి, కార్య = కార్యమునందు,
వినోది = క్రీడించునది, నిజ = నీయొక్క, దాసజన = కైంకర్యము సేయుజనుల
యొక్క, ఆవళికి = సమూహమునకు, ఎల్లప్రొద్దున్ = ఎప్పుడును, వికుంఠ =
విష్ణుదేవుని వాసస్థానమయిన, పరమపదమనెడి, మందిర = గృహముయొక్క
ద్వారా = ద్వారమునందలి, కవాట = తలుపును, భేది = భేదించునది.

తా. రామా! నీ తారకనామము భయంకరులయిన యమదూతల
కును గుండెలదురఁజేయును. దరిద్రతఅనెడు పిశాచమును బోగొట్టును. ఎల్లప్పు
డును, నీదాసజనులు పరమపదమునకుఁబోవుటకుగలయడ్డములనుపారదోలును

ఉ. విన్నపమాలకించు రఘు • వీర నహిప్రతిలోకమందు నా
కన్న దురాత్ముఁడుం బరమ • కారుణికోత్తమ వేల్పులందు నీ
కన్న మహాత్ముఁడుం బతిత • కల్మషదూరుఁడు లేఁడు నాకు వి
ద్వన్నుత నీవె నాకుగతి • దాశరథీ కరుణాపయోనిధీ. 39

టీ. రఘువీర=రఘురాజు కులమునఁ బుట్టిన శూరుఁడైనవాఁడా! విన్నపము=ఒక మనవిని, ఆలకించు, ఆమనవి యేమనఁగా, ప్రతిలోకమందున్=అన్ని జగత్తులందును, నాకన్నన్=నాకంటెను, దురాత్ముఁడు=దుష్టుఁడు, నహి=లేఁడు, కారుణికోత్తమ=కరుణగలవారిలోనెల్ల శ్రేష్ఠుఁడైనవాఁడా, వేల్పులందున్=దేవతలందు, నీకన్నన్, నీకంటెను, మహాత్ముఁడున్=గొప్పవాఁడును, పతిత=పాపాత్ములయొక్క, కల్మష=పాపములను, దూరుఁడు దవ్వుగాఁజేయువాఁడును, నాకున్, లేఁడు=గలుగఁడు, విద్వన్నుత=పండితులచేత కొనియాఁడబడువాఁడా, నీవు, నాకున్, గతి=దిక్కు.

తా. రఘువీరా! ఒక మనవి ఆలకింపుడు. ఏలోకమందైనను నాకంటె దుష్టుఁడు లేఁడు. దేవతలందు నీకంటె మహాత్ముఁడును పాపరహితుఁడును లేఁడు కాఁబట్టి దుష్టులలో శ్రేష్ఠుఁడనైననాకు, దేవతలలో శ్రేష్ఠుఁడవైన నీవే దిక్కయి రక్షింప శక్తుఁడవగుదువుగాని మఱియొకరు గానరారు.

ఉ. పెంపను దల్లివై కలుష • బృందసమాగమ మొందకుండ ర
క్షింపను దండ్రివై మెయివ • సించు దశేంద్రియరోగముల్ నివా
రింపను వెజ్జవై కృప గు • ఱించి పరంబు దిరంబుగాఁగ స
త్సంపద లియ్య నీవెగతి • దాశరథీ కరుణాపయోనిధీ. 40

టీ. పెంపను=పోషింపను, తల్లివి, ఐ=అయి, కలుష=పాపముల యొక్క, బృంద=సమూహముయొక్క, సమాగమము=కూడికను, ఒందకుండన్=చెందకుండునట్లు, రక్షింపను=కావను, తండ్రివి, ఐ=అయి, మెయిన్=దేహమునందు, వసించు=ఉన్నట్టి, దశేంద్రియ=పదియింద్రియముల నెడి, రో

గములన్ = తెవుళ్ళను, నివారింపను=పోఁగొట్టుటను, వెజ్జవై= వైద్యుఁడవై, కృప= దయను, గురించి=గలిగి, పరంబున్ = మోక్షమును, తిరంబుగాగన్ = స్థిరముగు నట్లుగా, సత్సంపదలు= మేలయిన సంపత్తులను, ఇయ్యన్ = ఇచ్చుటకు, నీవె గతి= దిక్కు.

తా. పోషించుటకు తల్లివలెను; దోషములను దండించుటకు తండ్రి వలె రక్షింపను, దేహమునందలి పదియింద్రియములనెడు రోగములను తొలఁ గించుటకు వైద్యునివలెను మేలయినసంపదలియ్యను నీవే నాకుదిక్కు.

ఉ. కుక్షినజాండపంక్తు లొనఁ • గూర్చి చరాచరజంతుకోటి సం
రక్షణ సేయుతండ్రివి ప • రంపర నీతనయుండనైన నా
పక్షము నీవుగావలదె • పాపము లెన్నియొనర్చినన్ జగ
ద్రక్షక కర్తవీవె కద • దాశరథీ కరుణాపయోనిధీ. 41

టీ. కుక్షిన్ = ఉదరమునందు, అజాండ= బ్రహ్మాండముల యొక్క, పంక్తులు=సమూహములు, ఒనఁగూర్చి= పొందికపఱచి అనుట, చర=చరించునట్టి చేతనములును అచర=చరింపని చేతనములును, జంతు = ప్రాణుల యొక్క, కోటిన్ = సమూహమును, రక్షణ=కాపాడుటను, సేయుతండ్రివి = చేయునట్టి తండ్రివి, పరంపరన్ = వరుసగా తరతరముగా, నీతనయుండను= నీకొడుకును, ఐన=అయినట్టి, నాపక్షము=నాయొక్క పాలిటి వాఁడవు, ఎన్ని పాపములు ఒనర్చినన్ = నేను చేసినను, నీవు, కావలదె= కావలదా, జగత్ = లోకములను, రక్షణ=రక్షించుట యందు, కర్త=కర్తయైనవాఁడవు, నీవుకద=నీవేకదా.

తా. కుక్షిలోపల బ్రహ్మాండ సమూహములను పొందికగా పెట్టు కొని చేతనములను అచేతనములైన సకలప్రాణిసమూహములను రక్షించు నట్టి తండ్రివికాఁబట్టి తరతరముగ నీకొడుకై యున్న నాపాలిట నీవు పక్షపాతివై యుండవలయును. నేను పాపములు చేసితినని నీవు నన్ను వదలరాదు.

ఎన్ని పాపములుచేసినను లోకమెల్ల రక్షించువాఁడవు నీవొక్కఁడవే కనుక నీవే నన్ను కాపాడవలయును.

ఉ. గద్దరి యోగి హృత్కమల • గంధరసానుభవంబుఁ జెందు పె
న్నిద్దపుగండుఁ దేఁటి ధర • ణీసుత కౌఁగిలి పంజరంబునన్
ముద్దులుగుల్కు రాచిలుక • ముక్తినిధానము రామ రాఁగదే
తద్దయు నేఁడు నాకడకు • దాశరథీ కరుణాపయోనిధీ. 42

టీ. గద్దరి=దిట్టలైన, యోగి=యోగులయొక్క, హృత్=హృదయమనెడి, కమల=తామరలయందలి, గంధ=వాసనతోఁ గూడిన, రస=మకరందముయొక్క, అనుభవంబున్=ఆస్వాదనమును, చెందు=పొందునట్టియు, పెను=మిక్కిలి, నిద్దపు=నిగనిగ యనెడి మిసిమిగల, గండు=మదించిన, తేఁటి=తుమ్మెదయైనవాఁడు, ధరణీసుత=సీతాదేవియొక్క, కౌఁగిలి=ఆలింగనమనెడి, పంజరంబునన్=గూఁటియందు. ముద్దులుగుల్కు=మనోజ్ఞముగానుండు, రాచిలుక=రాచచిలుక, ముక్తినిధానము=మోక్షముండెడిచోటు, రామ=శ్రీరామా, నాకడకున్=నాయొద్దకు, నేఁడు, తద్దయున్=మిక్కిలి రాఁగదే=రమ్మా.

తా. తామరలయందలి తేనెను అనుభవించు తుమ్మెదవలె యోగశీలుర హృదయమందు భక్తిరసములు అనుభవించువాఁడును, గూటియందలి రాచిల్కవలె సీతాదేవి కౌఁగిలియందు ముద్దు గులుకువాఁడును, మోక్షమిచ్చువాఁడును, అగు శ్రీరామా! నేఁడు నాయొద్దకు వేగరమ్మా.

ఉ. కలియుగమర్త్యకోటి నినుఁ • గన్గొన రానివిధంబొ భక్తవ
త్సలతవహింపవో చటుల • సాంద్రవిపద్దశ వార్ధిఁగ్రుంకుచోఁ
బిలిచినఁ బల్క వింతమఱి • పే నరులిట్లన రాముగాన నీ
తలఁపున లేదె సీతచెఱ • దాశరథీ కరుణాపయోనిధీ. 43

టీ. కలియుగ=కలియుగమందలి, మర్త్యకోటి=మనుష్యసమూహము, నిన్ను, కనుగొనరానివిధంబో=తెలిసికొనరాని విధమో, భక్తవత్సలతన్=భక్త

లయెడల వాత్సల్యము గలిగియుంటవు, ఒహింపకో=తాల్పకో, చటుల=మిక్కిలియయిన, సాంద్ర=దట్టమైన, విపత్=ఆపదలయొక్క, దశ=అవస్థయనెడి, వార్ధిన్=సముద్రమునందు, క్రుంకువోన్=నేను మునుఁగునపుడు, పిలిచినన్=నిన్ను పిలువఁగా, పల్కవు=పలుకవు, ఇంతెమఱపే=ఇంతెమఱచిపోవుటయా? నరులు=నాఁబోటిమనుష్యులు, ఇట్లు=ఈప్రకారము, ఇంతమఱుపాయని, అనరాదుగాక=చెప్పరాదుగాని, నీతలంపునన్=నీచింతయందు, సీతచెఱ=రావణునిచేత సీత పొందినచెఱ, లేదె=లేదా.

తా. రామా! నేనుమిక్కిలి ఆపత్సముద్రమునమునుఁగుచు నిన్ను ఎంతపిలిచినను, తిరిగి పలుకవు. ఇదేల? కలియుగమందు మనుష్యులకు కనబడరాదనియా? లేక భక్తజనులయెడల నీకువాత్సల్యము లేదా? ఇటులునన్ను మఱచి పోవచ్చునా? నీకుమఱపని మాఁబోటులు చెప్పరాదు. సీతాదేవికి కలిగిన చెఱను మఱవవుగదా? అట్టి మాచెఱకును నీకు మఱపు ఎక్కడిది?

ఉ. జనవర మీకథాళి వినఁ • సైఁపక కర్ణములందు ఘంటికా
నినదవినోదముల్ సలుప • నీచునకున్ వరమిచ్చినావు ని
న్ననయమునమ్మి కొల్చిన • మహాత్ములకేమియొసంగెదో సనం
దననుత మాకొసంగుమయ • దాశరథీ కరుణాపయోనిధీ 44

టీ. జనవర=ఓరాజా, మీకథాళి=మీకథలయొక్క సమూహము, వినన్=వినుటకు, సైఁపక=ఓర్వక, కర్ణములందున్=చెవులయందు, ఘంటికా=గంటలయొక్క, నినద=శబ్దములయొక్క, వినోదముల్=వేడుకలను, సలుపునీచునకున్=జేయుచున్న అల్పునికి, వరము=కోరినకోరిక, ఇచ్చినావు, నిన్ను, అనయమున్=ఎల్లప్పుడును, నమ్మి, కొల్చిన, మహాత్ములకున్=సేవించునట్టి మహనీయులకు, ఏమి, ఒసంగెదో=ఇచ్చెదవో. సనందననుత=సనందనుఁడు అను ఋషిచేత కొనియాడఁబడినవాఁడా, మాకున్, ఒసంగుమయ=ఇయ్యవయ్య.

తా. ఓ రాజా! నీచరిత్రను వినుటకుఓర్వక చెవులయందుఘంటలగ్వ

నీ యొక్క వేడుకలను సలుపు నీచునికి కోరిన వరము ఇచ్చినావు. ఎప్పుడు నిన్ను నమ్మి సేవించునట్టివారికి ఏమియిచ్చెదవో, సనందనుఁడను ఋషిచేత కొనియాడఁబడినవాఁడా! వారికిచ్చినట్లె నాకును నిమ్ము.

ఉ. పాపములొందువేళ రణ • పన్నగ భూత భయజ్వరాదులం
దాపద నొందువేళ భర • తాగ్రజ మిమ్ము భజించువారికిం
బ్రాపుగ నీవుఁ దమ్ముఁడిరు • పక్కియలం జని తద్విపత్తి సం
తాపము మాన్పి కాతువఁట • దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. పాపములు, ఒందువేళన్=పొందుసమయమందు, పన్నగ=సర్పము, భూతభయ=భూతములవల్లన కలుగు భయమును, జ్వర=జ్వరములు, ఆదులందున్=మొదలగువానియందు, ఆపదన్=విపత్తును, ఒందువేళన్=పొందుసమయముననను, భరతాగ్రజ=భరతునికి అన్నవైన శ్రీరామా, మిమ్మున్=మిమ్ము, భజించువారికిన్=కొలుచువారికి, నీవు=నీవును, తమ్ముఁడు=తమ్ముఁడయిన లక్ష్మణుఁడును, ఇరుపక్కియలన్=రెండు ప్రక్కలను, ప్రాపుగన్,సహాయముగ, చని=పోయి, తత్=వారియొక్క, విపత్తి=. ఆపదచేతనైన, సంతాపమున్=ఉడుకును= మాన్పి, పోఁగొట్టి కాతువఁట= కాపాడుదువందురు.

తా. రామా! పాపములుపొందునపుడును యుద్ధము సర్పములు భూతములు, జ్వరములు మొదలయినవానిచేత ఆపదగలిగినప్పుడును నిన్ను గొలుచునట్టివారికి సహాయము సేయబోయి నీవును, నీతమ్ముఁడైన లక్ష్మణుఁడును రెండుప్రక్కల నిలిచి వారి యాపదలను బోఁగొట్టి రక్షింతువని లోకులు చెప్పుదురు. కాఁబట్టి నన్నును కాపాడవలయును.

చ. అగణితజన్మకర్మ దురి • తాంబుధిలో బహుదుఃఖవీచికల్
దెగిపడనీఁద లేక జగ • తీధవ నీపదభక్తినావచేఁ
దగిలి తరింపఁగోరితిఁ బంటదంపడి నాదుభయంబు మాన్పవే
తగదనిచిత్తమందిడక • దాశరథీ కరుణాపయోనిధీ. 46

టీ. జగతీధవ=రాజా, అగణిత=లెక్కలేని, జన్మ జన్మములందలి, కర్మ=కర్మపరంపరచేఁగల్గిన, దురిత=పాపములనెడి, అంబుధిలోన్=సముద్రమందు, బహు=అనేకములయిన, దుఃఖ=దుఃఖములనెడి, వీచికల్=అలలను, తెగిపడన్=కడచునట్లు, ఈఁదలేక=ఈఁదజాలక, పదంపడి=పిమ్మట, నీపదభక్తినావచేన్=నీయొక్క పాదములందలి భక్తి అనెడి ఓడచేత, తగిలి=ఆసక్తితోడ, తరింపఁగోరితిన్=దాటను ప్రయత్నించితిని. తగదు అని=తగినదికాదు అని, చిత్తమందు=నీమనస్సునందు, ఇడక=ఉంచుకొనక, నాభయంబున్=నాయొక్క భయమును, మాన్పవే=పోఁగొట్టుము.

తా. భూనాథా! లెక్కలేని జన్మములందలి కర్మపరంపరలచేఁ గలిగినపాపములు సముద్రమువలె అపారమై నాయంతట పోఁగొట్టుకొనుటకు చేతగాక, నీయందలిభక్తి కలిగి ఈదరాని సముద్రమును ఓడచే సులువుగా దాటునట్లు తొలఁగింపరాని నాపాపములను సులువుగా నీభక్తిచేఁ బోఁగొట్టుకొనఁగోరితిని. కావున శరణుజొచ్చిననాయొక్క భయమునుపోఁగొట్టుమూ.

ఉ. నేనొనరించుపాపము ల • నేకములైనను నాదుజిహ్వకుం
బానకమయ్యె మీపరమ • పావననామము దొంటిచిల్కరా
మా ననుఁగావుమన్నతుది• మాటకు సద్గతిఁజెందెఁగావునన్
దానిధరింపఁ గోరెదను • దాశరథీ కరుణాపయోనిధీ. 47

టీ. నేను, ఒనరించుపాపములు=చేయునట్టిపాపములు, అనేకములు=పెక్కులు, ఐనను, నాదుజిహ్వకున్=నాయొక్క నాలుకకు, మీపరమపావననామము=మీయొక్క మిక్కిలి పవిత్రమైన పేరు, పానకముఅయ్యెన్=పానకమువలె రుచియైనదని, తొంటిచిల్క=పూర్వకాలముచిలుక, రామా, నన్ను కావుము=నన్నురక్షింపుము, అన్న తుదిమాటకున్= అని పలికినట్టి కడపటిపలుకునకు, సద్గతిన్=మోక్షమును, చెందెన్=పొందెను, కావునన్=కనుక, దానిన్=ఆరామనామమును, ధరింపన్ కోరెదను=తాల్చుటకు ఇష్టపడెదను.

తా. రామా! పాపము లనేకములు నేను చేయుచున్న వాఁడను. ఇట్టి పాపాత్ముఁడనయినను నీ దివ్యనామము ఉచ్చరించుటకు నా నాలుకకు పానకమువలె మిక్కిలిరుచియైనది. ఎట్లనఁగా పూర్వ మొకచిలుక "రామా నన్నుఁ గావుము, అని కడపట నొక్కమాట చెప్పఁగానే మోక్షము నొందెనుగదా. అట్టిస్థితిఇచ్చునదిగాననాకుఅతిరుచిగలనీనామమునుపఠించెదను

చ॥ పరధనముల్ హరించి పర♦ భామలనంటిపరాన్నమబ్బినన్
మురిపముకానిమీఁదనగు ♦ మోసమెరుంగదుమానసంబుదు
స్తరమిదికాలకింకర గ ♦ దాహతి పాల్పడనీక మమ్ము నే
తరి దరిజేర్చి కాచెదవొ ♦ దాశరథీకరుణాపయోనిధీ. 48

టీ. పరధనముల్ = ఇతరుల డబ్బును, హరించి = కొంగిలించి, పరభామలన్ = ఇతరుల స్త్రీలను, అంటి = తాకి, పరాన్నము = ఇతరులకూడు, అబ్బినన్ = దొరకఁగా, మురిపముకాని = విలాసమే కాని, మీఁదన్ = పిమ్మట అగు మోసము = కలుగునట్టి మోసమును, మానసంబు = మనస్సనకు, ఎఱుంగదు. ఇది = ఇట్లు తెలియకుండుట, దుస్తరము = తరింపరానిది, కాలకింకర = యమ దూతలయొక్క, గదా = గదలయొక్క, హతి = దెబ్బలయొక్క, పాలు = అధీనత, పడనీక = పొందనీక, మమ్మున్, ఏతరిన్ = ఎప్పుడు; దరిచేర్చి, కాచెదవో = రక్షింతువో.

తా. దశరథరామా! పరులధనములను దొంగిలించుట పరస్త్రీలను పొందుట, పరాన్నమును దినుట మొదట సుఖముగా నుండినను, వెనుకనరకముగలిగించును. ఇది మనస్సునకు తెలియదు. మనస్సును జయించుటకష్టము గనుక మనస్సు పోయినదారిని పోయి నరకమున బడకుండునట్లు మమ్ము నెప్పుడు కడతేర్చి కాపాడెదవో.

ఉ. చేసితిఘోరకృత్యములు ♦ చేసితిభాగవతాపచారముల్
చేసితి నన్యదైవములఁ ♦ జేఁభజించినవారిపొందు నేఁ

జేసిన నేరముల్దలఁచి • చిక్కులు బెట్టకుమయ్య యయ్యనీ
దాసుడనయ్య భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 49

టీ. ఘోరకృత్యములు=భయంకరములయిన కార్యములను, చేసితిని, భాగవతాపచారముల్=భక్తులయెడ అపరాధములను, చేసితిని, అన్య దైవములన్=ఇతరదేవతలను, చేరి=ఆశ్రయించి, భజించినవారి పొందున్=కొలిచినట్టివారి సాంగత్యమును, చేసితిని, నేన్=నేను, చేసిన నేరముల్=గావించినట్టితప్పులను, తలఁచి=ఎంచి, చిక్కులన్ పెట్టకుము అయ్య=సంకటములందు తగల్పకుమయ్య, అయ్య=అయ్యా, నీదాసుడను, అయ్యానీయొక్క దాసుఁడను

తా. దశరథరామా! నేను ఘోరమయిన కార్యములను జేసితిని. భాగవతులకు అపచారములుచేసితిని. ఇతరదైవములను గొలుచువారితో సాంగత్యము జేసితిని. నేను జేసినట్టి తప్పులనుతలఁచి సంకటములను పెట్టవద్దు. నేను నీకు దాసుడను.

ఉ. పరులధనంబుజూచి పర • భామలజూచి హరింపఁగోరు మ
ద్గురుతరమానసంబనెడు • దొంగను బట్టి నిరూఢదాస్య వి
స్ఫురితవివేకపాశములఁ • జుట్టి భవచ్చరణంబనే మరు
త్తరువునఁగట్టివేయఁగదె • దాశరథీకరుణాపయోనిధీ. 50

టీ. పరులధనంబులన్=ఇతరులసొత్తును, చూచి, పరభామలన్=పరస్త్రీలను, చూచి, హరింపన్=దొంగిలించుటకు, కోరునట్టి, మత్=నాయొక్క గురుతర=మిక్కిలిగొప్పదైన, మానసంబు=మనస్సు, అనెడుదొంగను=అనునట్టిదొంగను, పట్టి=పట్టుకొని, నిరూఢ=మిక్కిలి పెరిగిన, దాస్య=కైంకర్యమునందు, విస్ఫురిత=మిక్కిలి ప్రకాశించిన, వివేక=తెలివియనెడి, పాశములన్=త్రాళ్ళచేత, చుట్టి=బంధించియనుట, భవచ్చరణంబు = నీపాదము, అనే మరుత్ తరువునన్=అనెడిదేవతావృక్షమున, కట్టివేయన్ కదే = బంధించివేయుము.

తా. ఇతరులసొత్తులను, స్త్రీలనుచూచి అపహరించుటకు కోరునట్టి నాయొక్క మనస్సు అనునట్టి దొంగనుపట్టుకొని నీయొక్క కైంకర్యముచే ప్రకాశించునట్టి తెలివియనెడి కల్పవృక్షమునకు గట్టుము.

చ. సలలిత రామనామ జప • సార మెఱుంగను, గాశికాపురీ
నిలయుఁడగాను మీచరణ • నీరజ రేణు మహాప్రభావముం
దెలియనహల్యగాను జగ • తీవర నీదగు సత్యవాక్యముం
దలఁపఁగ రావణాసురుని • తమ్ముఁడగాను భవద్విలాసముల్
తలఁచి నుతింప నాతరమె • దాశరథీ కరుణాపయోనిధీ. 51

టీ. సలలిత=మిక్కిలిఒప్పుచున్న, రామనామ = రామనామముయొక్క, జప=జపముయొక్క, సారము=మహాత్మ్యము, ఎఱుంగను=తెలియుటకు కాశికాపురీనిలయుఁడను=కాశీపట్టణము వాసస్థానముగాఁగల శివుఁడను కాను, మీచరణనీరజ=మీపాదపద్మములయొక్క, రేణు=దుమ్ముయొక్క, మహాప్రభావము=గొప్పమాహాత్మ్యమును, తెలియన్=తెలియుటకు, అహల్యనుకాను=అహల్యనుకాను, జగతీవర=భూనాథా, నీదగుసత్యవాక్యము=నీదైనట్టి నిజమైనమాటను, తలఁపగన్=ఎన్నుటకు, రావణాసురుని తమ్ముఁడను=విభీషణుఁడను, కాను, భవత్ విలాసముల్=నీయొక్క మహత్వపువైచిత్ర్యములు, తలఁచి=ఎన్ని, నుతింపన్=పొగడుటకు, నాతరమె=నాకు శక్యమా.

తా. దశరథరామా! నీనామమును జపముచేయుటవలని మహత్తు శివునకే తెలియునుగాని నాకు తెలియదు. నీపాదధూళియొక్క ప్రభావము అహల్యకే తెలియును. నీసత్యము విభీషణునికే తెలియును. కాని నీలీలలు నావంటివానికి తెలిసి వర్ణించుటకు చేతగాదు.

ఉ. పాతకులైనమీకృపకుఁ • బాత్రులుకారె తలంచిచూడ, జ
త్రాతికిఁగల్గెఁ బావనమ • రాతికి రాజ్యసుఖంబుగల్గె దు

ర్జాతికిఁబుణ్యమబ్బెఁగపి • జాతి మహత్త్వముఁబొందెఁగావునన్
దాతవ యెట్టి వారలకు • దాశరథీ కరుణాపయోనిధీ. 52

టీ. పాతకులైనన్ = పాపాత్ములైనను, మీకృపకు = మీదయకు, పాత్రులుకారె = అర్హులు కారా, తలంచిచూడన్ = ఎన్నిచూడఁగా, (పాతకులు నీదయకు పాత్రులుకారోయని విచారించిచూడఁగా) ననుట, చట్రాతికిన్ = పెద్దరాయిగానున్న అహల్యకు, పావనము = పవిత్రత్వము, కల్గెన్ = కలిగెను, అరాతికిన్ = శత్రువైన విభీషణునికి, రాజ్యసుఖంబు = రాజ్యప్రాప్తియనెడి సుఖము, కల్గెన్ = కలిగెను, దుర్జాతికి = నీచజాతులవారికిని, పుణ్యము = సుకృతము, అబ్బెన్ = లభించెను, కపిజాతి = వానరజాతి, మహత్త్వము = మహిమను, పొందెన్ = ఒందెను, కావునన్ = కనుక, ఎట్టివారలకున్ = ఎంతటివారలకైనను, దాతవు = కోరినకోర్కులు ఇచ్చువాఁడవే.

తా. దశరథరామా! పాపాత్ములైనను మీకృపకు పాత్రులైయున్నారు. ఎట్లనఁగా రాయిగానుండిన అహల్య నీపాదధూళిచే నిజరూపము నొంది కృతార్థురాలైనది. పగవారివర్గములోఁజేరిన విభీషణుఁడు నీవలన లంకారాజ్యము నొందినాడు. జటాయువు, శబరి మొదలయిన తక్కువ జాతులకును నీయనుగ్రహము గలిగినది. సుగ్రీవాదులైన వానరులకుఁగూడ మహత్త్వము గలిగినది. ఇవన్నియుఁజూడఁగా కలిమి, లేములు పాటింపక ఎట్టివారికైన కోరిన కోర్కులనిచ్చు దాతవని తెలియుచున్నది. కాఁబట్టి నా కోర్కెయు నొసఁగుమా.

ఉ. మామకపాతక వ్రజము • మాన్ప నగణ్యము చిత్రగుప్తు లే
మేమని వ్రాఁతురో శమనుఁ • డేమి విధించునొ కాలకింకర
స్తోమమొనర్చుటేమొ వినఁ • జొప్పడదింతకుమున్నె దీనచిం
తామణి యెట్లుగాచెదవొ • దాశరథీ కరుణాపయోనిధీ. 53

టీ. మామక = నాయొక్క, పాతకవ్రజము = పాపసమూహము, మాన్పన్ = పోఁగొట్టుటకు, అగణ్యము = లెక్కింపరానిది, చిత్రగుప్తులు = యమునియొద్దనుండి జీవుల పుణ్యపాపముల లెక్కలు వ్రాయుచుండు కరణమైన, ఏమి ఏమి అని = ఏ యేవిధముగా, వ్రాంతురో = వ్రాయుదురో, శమనుడు = యముఁడు, ఏమి = ఏమి, విధించునో = ఆజ్ఞాపించునో, కాలకింకరస్తోమము = యమదూతల సమూహము, ఒనర్పుట = చేయుట, ఏమో = ఏదియో, వినన్ = వినుటకు, చొప్పడదు = సరిపడదు, ఇంతకుమున్నె = దీనికిపూర్వమే, దీనచింతామణి = దీనులైనవారికి చింతామణివలె కోరినకోర్కెలు ఇచ్చువాఁడా, ఎట్లు = ఏవిధమున, కాచెదవో = కాపాడెదవో.

తా. దశరథరామా! నా పాపములు పోఁగొట్టుటకుఁ జాల కలవు. చిత్రగుప్తుఁ డేమి వ్రాయునో? యముఁ డేమి విధించునో? కాలకింకరు లేమి చేయుదురో? ఇంతకుఁ బూర్వమే దీనరక్షణకై కంకణముఁ గట్టుకొని కోర్కెలు దీర్చుచుని వెట్లు కాపాడెదవో తెలియరాదు.

ఉ. దాసినచుట్టమా శబరి • దానిదయామతి నేలినావు నీ
దాసునిదాసుడా గుహుఁడు • తావక దాస్యమొసంగినావు నే
జేసినపాపమో వినుతి • చేసినఁగావవు కావుమయ్య నీ
దాసులలోన నేనొకఁడ • దాశరథీ కరుణాపయోనిధీ 54

టీ. శబరి, దాసిన = దగ్గఱిన, చుట్టమా = బంధువా, దయామతిన్ = దయతోఁగూడిన బుద్ధితో, ఏలినావు = రక్షించినావు, గుహుఁడు, నీదాసునిదాసుఁడా = నీ సేవకుని సేవకుఁడా, తావకదాస్యము = నీదైనదాస్యము, ఒసంగినావు = ఇచ్చితివి, వినుతిన్ = స్తోత్రమును, చేసినన్ = నేను చేసినప్పటికిని, కావవు = రక్షింపవు, నేన్ = నేను, చేసినపాపమో = చేసికొన్నట్టిదోషమో, దాసులలోనన్ = నీ సేవకుల లోపల, నేనుఒక్కఁడను, కావవయ్యా = రక్షింపుమా

తా. రామా ! శబరి నీపదగ్గఱిబంధువు కాకపోయినను, దానిని దయతోఁ గాపాడితివి. గుహుఁడు నీదాసునికిగూడ దాసుడుగాడు. కాకపోయినను దాసునిగాఁజేసికొంటివి. నేను నీదాసవర్గములో ఒకఁడుగానున్నాడను. మఱియు నిన్ను ధ్యానముచేసినను నేను చేసికొన్న పాపమేమోకాని నన్ను గాపాడవు. ఇఁకనయినను కాపాడుమా.

ఉ. దీక్షవహించి నాకొలఁది•దీనుల నెందఱిఁ గాచితో జగ
ద్రక్షక తొల్లి యా ద్రుపద • రాజతనూజ తలంచినంత నే
యక్షయ మైనవల్వ లిడి•తక్కట నా మొఱఁ జిత్తగించి ప్ర
త్యక్షము గావవేమిటికి • దాశరథీకరుణాపయోనిధీ, 55

టీ. జగద్రక్షక=జగమును రక్షించువాఁడా, దీక్షన్ =నియమమును, వహించి=తాల్చి, నాకొలఁదిదీనులన్=నను బోలు దిక్కు లేనివారిని, ఎందఱిని, కాచితో=కాపాడితివో, తొలి=ముందు, ఆ ద్రుపదరాజతనూజ=ద్రుపదరాజు కుఁతురైన యా ద్రౌపది, తలంచినంత నే=స్మరించినంత మాత్రము ననే, అక్షయము=తఱుగనిది, అయినవల్వలు=అయినట్టిచీరలు, ఇడితి=ఇచ్చితివి, అక్కట=అయ్యో, నా మొఱన్=నామనవిని, చిత్తగించి=ఆలకించి, ప్రత్యక్షము=సాక్షాత్తుగా, కావవు ఏమిటికి=ఏల కాపాడవు.

తా. దశరథరామా! నమ్మినవారిని రక్షించునియమమును పూని ఎందఱిని కాపాడితివో నాకుఁ దెలియదు. నేను విన్నంతవఱకు పూర్వము ద్రౌపది దుర్యోధనునిసభలో చీరలు ఒలుచునపుడు నిన్నుస్మరించినంత నే లెక్క లేని చీరలిచ్చితివఁట. అయ్యో! నామనవి చిత్తగించి నా మొఱ యాలించి నన్నేల కాపాడవు.

ఉ. నీల ఘనాభమూర్తివగు•నిన్నుఁగనుంగొనఁ గోరివేఁడినన్
జాలము సేసి డాగెదవు • సంస్తుతి కెక్కిన రామనామమే

మూలను దాఁచుకోఁగలవు • ముక్తికిఁ బ్రాపది పాపమూలకు
ద్దాలముగాదె మాయెడల • దాశరథీకరుణాపయోనిధీ. 56

టీ. నీల=నల్లని, ఘన=మేఘముతో, ఆభ=సాటియైన, మూర్తివి=దేహముగలవాఁడవు, అగునిన్నున్=అయినట్టినిన్ను, కనుఁగొనన్=చూచుటకు, కోరి=అపేక్షించి, వేడినన్=ప్రార్థింపఁగా, జాలముచేసి=మాయచేసి, డాఁగెదవు=దాచుకొనెదవు, సంస్తుతికిన్=పొగడ్తకు, ఎక్కినరామనామము=వచ్చినట్టిరామనామము, ఏమూలను=ఏమూలయందు, దాచుకోఁగలవు=దాచుకొననేర్తువు, అది=ఆరామనామము, మాయెడలన్=మావిషయమందు, ముక్తికిన్=మోక్షమునకు, ప్రాపు=ఊతపట్టు, పాప=పాపములయొక్క, మూల=వేళ్ళకు, కుద్దాలము=గుద్దలి, కాదె=కదా.

తా. రామా! నల్లని మేఘమువలె నీ విగ్రహము కన్నార చూడవలయునని యెంత ప్రార్థించినను, మాయచేసి దాఁచుకొనెదవు. మంచిది! నీవు దాగినను సుప్రసిద్ధమై వ్యాపించియున్న నీ రామనామమును నీవు యెక్కడను దాఁచిపెట్టుకొనలేవు, పాపములను గుద్దలి వేళ్ళను పెల్లగించునట్లు సమూలముగాఁ బోఁగొట్టి మోక్షమిచ్చుటకు అదియొకటియే కాన అదియే చాలును.

చ. వలదు పరాకుభక్తజన • వత్సలనీచరితంబు వమ్ముగా
వలదు పరాకు నీబిరుదు • వజ్రమువంటిది కావకూరకే
వలదు పరాకు నాదురిత • వార్ధికిఁదెప్పవుగా మనంబులోఁ
దలఁతుమె కా నిరంతరము • దాశరథీకరుణాపయోనిధీ. 57

టీ. భక్తజన=భక్తసమూహములకు, వత్సల=వాత్సల్యముకలవాఁడా, నీచరితంబు=నీచరిత్ర, వమ్ము=వృథా, కావలదు=కాకుండనిమ్ము, పరాకు=హెచ్చరిక, నీబిరుదు=దీనరక్షకుఁడు అనెడి నీ బిరుదము, వజ్రమువలె గట్టిది, కావక=(మమ్ము) రక్షింపక, ఊరకే=వ్యర్థముగా, వలదు=వద్దు, పరాకు=

హెచ్చరిక, నాదురితవార్ధికిన్ = నాపాపసముద్రమునకు, తెప్పవుగాన్ = తెప్పగా, మనంబులోన్ = మనస్సునందు; నిరంతరము = ఎప్పుడును, తలఁతు నే కొ = తలంతుముసుమా.

తా. భక్తులయందు ప్రేమగలవాఁడా! ఆశ్రితరక్షణాదులు తెలుపు నీచరిత్రములును, ఆశ్రితరక్షకుఁడని వజ్రమువలె అభేద్యమైన నీబిరుదును వ్యర్థమగును. అట్లుచేయవలదు. జాగ్రత్తసుమీ! నిన్ను, సముద్రమును దాఁటించు తెప్పవలె నాపాపములను పోఁగొట్టువానినిగా మనసులో ఎప్పుడును తలంతును.

ఉ. తప్పులెఱుంగలేక దురి • తంబులు సేసితినంటి నీవు మా
యప్పవుగావుమంటి నిఁక • నన్యులకున్ నుదురంటనంటి నీ
కొప్పిదమైన దాసజను • లొప్పినబంటుకు బంటనంటి నా
తప్పుల కెల్ల నీవెగతి • దాశరథీ కరుణాపయోనిధీ. 58

టీ. తప్పులు=దోషములను, ఎఱుంగలేక = తెలిసికొనలేక, దురితంబులు = పాపములను, చేసితిన్ అంటి - చేసినాను అని చెప్పితిని, నీవు మా యప్పవు - నాతండ్రివి, కావుము అంటి - రక్షింపుమని చెప్పితిని, ఇఁకన్, అన్యులకు = ఇతరులకు, నుదురు = నెత్తిని, అంటను అంటి = తాకను అని చెప్పితిని, నీకు, ఒప్పినబంటునకు = సమ్మతించి స్వీకరించిన సేవకునికి, బంటను అంటి = సేవకుఁడను అంటిని, నాతప్పులకున్ ఎల్లన్ = నాఅన్ని దోషములకును, నీవె, గతి = దిక్కు.

తా. దశరథరామా! దోషములు తెలిసికొనలేక పాపములు చేసితిని ; నీవు మాతండ్రివి ; రక్షింపుము. ఇఁకమీఁద ఇతరులకు నెత్తితాకి యంజలిచేయను. దాసులకు దాసుఁడను అని నీతో చెప్పికొంటిని. ఇఁక నీదాసుల తప్పుల నెట్లో అట్లే నీదాసులకు దాసుఁడనైన నాతప్పులను దీర్చు దిక్కు నీవె సుమీ.

చ. ఇతఁడు దురాత్ముఁడంచు జను • లెన్నఁగ నాఱడిఁ గొంటి నేనెపో
పతితుఁడ నంటి నో పతిత • పావనమూర్తివి నీవు గల్గ నే
నితరుల వేఁడ నంటి నిహ • మిచ్చిన నిమ్ము పరంబొసంగుమీ
యతులిత రామనామ మధు • రాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గతమని నమ్మి కొల్చెదను • దాశరథీ కరుణాపయోనిధీ. 59

టీ. ఇతఁడు=వీఁడు, దురాత్ముఁడు అంచున్—దుష్టమనస్సుగలవాఁడు అనుచు, జనులు—లోకులు, ఎన్నఁగన్=తలఁపఁగా, ఆఱడిన్ కొంటిన్—నిందపడితిని, నేనెపో=నేనేసుమీ, పతితుఁడను అంటి—పాపాత్ముఁడను అని జెప్పితిని, ఓ=రామా, పతిత=పాపాత్ములైనవారిని, పావన=పవిత్రులనుజేయునట్టి, మూర్తివి అగు, నీవు కల్గన్=గలిగియుండఁగా, నేను, ఇతరులన్—అన్యులను, వేఁడను అంటిన్=ప్రార్థింపను అని చెప్పితిని, ఇహము=ఇహలోకసుఖము, ఇచ్చినన్=ఇచ్చితివేని, ఇమ్ము, పరంబు — పరలోక సౌఖ్యమును, ఒసంగుమీ—ఇచ్చినట్లైన ఇమ్మా, అతులిత — సాటిలేని, రామనామ = "రామ" అను పేరుయొక్క, మధుర — తీయనైన, అక్షర = అక్షరముల యొక్క, పాళి=సమూహము, నిరంతరంబు—ఎప్పుడును, హృద్గతము=మనస్సునుబొందినది. నామనస్సునందేయుండునది, అని, నమ్మి కొల్చెదను=సేవించెదను.

తా. నేను దుష్టమనస్సుగలవాఁడనని జనులచేత నిందపడితిని. నాయంతట నే నేపతితుఁడనని నీతో చెప్పికొంటిని. పతితులను పవిత్రులనుగాఁ జేయనవతరించి నీవుండఁగా పతితుఁడనైన నేను నిన్నే వేఁడుదును గాని మఱియొకరిని వేఁడనని యు చెప్పితిని. ఇక నీవొకడవే నాదు స్వామివిగనుక ఇహమిచ్చినను యిహ్య వలయును పరమిచ్చిన నీవయీయవలయును నేనుమాత్రము నాయంతట "రామ" యనెడి తీయని యక్షరములను మనస్సునందు నిలుపుకొని సేవచేసెదను.

ఉ. అంచితమైన నీదు కరు • ణామృతసారము నాదుపైని బ్రో
క్షించిన జాలు దానిర • సించెదఁ నాదురితంబులెల్లదూ

లించెద వైరి వర్గ మెడలించెదఁ గోర్కులనీదుబంటనై
ద్రుంచెదఁ గాలకింకరుల • దాశరథీ కరుణాపయోనిధీ. 60

టీ. అంచితము=ఒప్పునది, ఐన నీదుకరుణా=అయినట్టినీదయ అనెడి, అమృతసారము=అమృతముయొక్క తేట, నాదుపైని=నామీఁద, ప్రోక్షించినన్=చల్లినయెడల, చాలుస్=అదియే చాలును, దానన్=దానిచేత, నా దురితంబులు ఎల్లన్=నాపాపములను అన్నిటిని, నిరసించెదన్=తిరస్కరించెదను, వైరివర్గము, శత్రుసమూహమును, తూలించెదన్=చెడునట్లు చేసెదను, కోర్కులన్=రాగములను, ఎడలించెదన్=విడిచిపోవునట్లు చేసెద, నీదుబంటును ఐ=నీదాసుండనై, కాలకింకరులన్ = యమదూతలను, ద్రుంచెద=కొట్టి తరిమెద.

తా. రామా! ఒప్పిదమైన నీదయామృత సారమును నామీఁదచల్లిన చాలును. దానిచేతనే నా పాపములను మాలించి, అంతశ్శత్రువులయిన యింద్రియములను చిక్కఁబట్టి రాగద్వేషములను వదలి, నీదాసుండనై యమకింకరులు వచ్చిరేని కొట్టిపారదోలెదను.

చ. జలనిధులేడు నొక్క మొగిఁ • జక్కికిఁ దెచ్చెశరంబు ఔాతినిం
పలరఁగఁజేసెనాతిగఁ బ • దాబ్జపరాగము, నీచరిత్రముం
జలజభవాదినిర్జరులు • సన్నుతిసేయఁగ లేరు గావునం
దలఁపనగణ్యమయ్యె యిది • దాశరథీ కరుణాపయోనిధీ.61

టీ. శరంబు=నీబాణము, జలనిధులు ఏడున్=ఏడు సముద్రములను, ఒక్క మొగిన్=ఒక్కసారిగా, చక్కికిన్ = ఒక్కచోటికి, తెచ్చెన్=తెచ్చెను, పదాబ్జ = తామరలవంటి నీ యడుగుల, పరాగము = ధూళి, ఔాతిన్=ఔాతిని, ఇంపు=మనోహరమును అరలంగన్=ఒప్పునట్లుగా, నాతిగన్=స్త్రీగా, చేసెను, నీచరిత్రమున్ = నీకథను జలజభవ = బ్రహ్మ ఆది=మొదలుగఁగల నిర్జరులున్ = దేవతలును సన్నుతిసేయగన్ = స్తోత్ర

ము చేయఁగా, లేదు, కావునన్ = కనుక, తలఁపన్ = విచారింపఁగా, అగ
మ్యము=గణుతింపరానిది.

తా. రామా ! నీబాణము సప్తసముద్రములను ఒక్కచోటికి తీసి
కొని వచ్చినది. నీపాదపద్మములధూళి రాతిని స్త్రీగాఁజేసినది. ఇట్టి నీచరి
త్రము బ్రహ్మాదులకయినను పొగడ శక్యముగాదు కావునదానినివిచారింపసా
ధ్యమా ? కాదు.

ఉ॥ కోఁతికిశక్యమాయసుర • కోటుల గెల్వను గెల్చెఁబో నిజం
బాతనిమేన శీతకరుఁ • డౌట దవానలుఁ డెట్టివింత ! మా
సీతపతివ్రతామహిమ • సేవకుభాగ్యముమీకటాక్షమున్
ధాతకుశక్యమా పొగడ , దాశరథీ కరుణాపయోనిధీ. 62

టీ. అసురకోట్లను=కోట్లకొలది రాక్షసులను, గెల్వను=గెలుచుటకు,
కోఁతికిన్ = ఒక కోఁతికి, శక్యమా = సాధ్యమా, గెల్చెన్ పో = గెలు
వని, అతని మేనన్ = అవానరుని దేహమునందు, దవానలుడు = కాఱు
చిచ్చు, శీతకరుఁడు = చంద్రుడు, ఔట = అగుట, ఎట్టివింత = ఎంత
యాశ్చర్యము, మాసీత = మాతల్లియైన సీతాదేవియొక్క, పతివ్రతా = పా
తివ్రత్యముయొక్క, మహిమ = గొప్ప, సేవకుభాగ్యము = మిమ్ము సేవించు
వానియొక్క భాగ్యవిశేషమును, మీకటాక్షమున్ = మీయొక్కదయను,
పొగడన్ = స్తుతించుటకు, ధాతకున్ = బ్రహ్మదేవునికి, శక్యమా = తర
ముకాదు.

తా. రామా! ఒకకోతి భయంకరులైన రాక్షసులను కోట్లకొలఁదిని
గెలుచుట తరముకాదు. అది యెట్లోశక్యమైనను కానిమ్ము. కాని, అతని
తోఁకయందు అంటించిన నిప్పు వేఁడిమి అంటక చల్లనగుట మఱియు నాశ్చ
ర్యము. ఇంతకు సీతయొక్క పాతివ్రత్యప్రభావమును మీయిరువురిని సేవిం
చిన వానిభాగ్యమును మీ కరుణాకటాక్షమును కారణము గనుక ఈమాటిని
బ్రహ్మదేవునకు పొగడఁదరముకాదు. మనుబోఁటులు ఏమనిపొగడగలరు.

ఉ॥ భూపలలామ రామరఘు • పుంగవ రామ త్రిలోక రాజ్యసం
స్థాపన రామ మోక్షఫల • దాయక రామ మదీయపాపముల్
పాపఁగదయ్య రామ నినుఁ • బ్రస్తుతిసేసెదనయ్య రామ సీ
తాపతిరామ భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 63

టీ. భూపలలామ = రాజులను శ్రేష్ఠుఁడైన, రామ = రామా, రఘుపుంగవ = రఘువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడైన, రామ = రామా, త్రిలోక = ముల్లోకముల యొక్క, రాజ్య = రాజ్యమును, సంస్థాపన = స్థాపించినట్టి, రామా = రామా, మోక్ష = మోక్షమనెడి, ఫల = ఫలమును దాయక = ఇచ్చునట్టి, రామ = రామా, సీతాపతిరామా = సీతకు భర్తయైనరామాఁ, నిన్నుఁ బ్రస్తుతిసేసెద = పొగడెదను, మదీయపాపముల్ = నా పాపములను రామ = రామా, పాపఁగదయ్యా = పోఁగొట్టుమయ్యా.

తా. రామా! నీవు రాజులందరిలో శ్రేష్ఠుఁడవు మఱి రఘువంశమున బుట్టినవారిలో శ్రేష్ఠుడవు కేవలము రాజ శ్రేష్ఠుడవే కాదు. ముల్లోకములను సదురుగా నుండునట్లు ఏలునట్టిమేటివి. వానికంటె మిక్కిలి అతిశయ మోక్షఫలమును ఇచ్చువాఁడవు. అన్నిటికిని అతిశయించిన లక్ష్మియగు సీతాదేవికి భర్తవు. ఇట్టి మితిలేని అతిశయమును గలవాఁడవు గావున కోరినకోర్కు లియ్యవచ్చును. తెలిసినంతవఱకు నిన్ను పొగడెదను అపారద్ధను బట్టియైనను, నా పాపములను పోఁగొట్టినన్నుఁ గాపాడుము.

ఉ॥ నీసహజంబు సాత్త్వికము • నీ విడిపట్టు సుధాపయోధి, ప
ద్మాసనుఁడాత్మజుండు, గమ • కాలయ నీప్రియురాలు, నీకుసిం
హాసనమిద్ధరిత్రి గొడు • గాకస, మక్షులుచంద్రభాస్కరుల్
నీసుమతల్పమాదిఫణి • నీవెసమస్తముఁ గొల్చినట్టి నీ
దాసులభాగ్యమెట్టిదయ • దాశరథీ కరుణాపయోనిధీ, 64

టీ. సాత్త్వికము=సత్త్వగుణము, నీ సహజంబు=నీకు సహజమైనది సుధాపయోనిధి=పాలసముద్రము, నీ విడిపట్టు=నీయొక్క విడిదిస్థలము. ఆత్మజుండు=నీకొడుకు, పద్మాసనుఁడు=బ్రహ్మ, నీప్రియురాలు,కమలాలయ లక్ష్మీదేవి, ఈధరిత్రి=ఈభూమి, నీకు, సింహాసనము, ఆకసము=ఆకాశము, గొడుగు, చంద్రభాస్కరులు=చంద్రుఁడును,సూర్యుఁడును,అక్షులు=కన్నులు, ఆదిఫణి=ఆదిశేషుఁడు. నీకుమేతల్పము=నీపూలపాన్పు, సమస్తముఁ=సర్వ. పదార్థములును, నీవే, ఇట్టి నిన్నుఁ గొల్చినట్టి=సేవించునట్టి, నీదాసుల = నీ దాసజనులయొక్క, భాగ్యము=పెంపుసొంపు, ఎట్టిదయా=ఎట్టిదయ్యా.

తా. రామా!సత్త్వగుణము నీస్వభావము, నీవిడిది పాలసముద్రము, నీకొడుకు బ్రహ్మదేవుడు, నీభార్యలక్ష్మి,ఈభూమి నీసింహాసనము, ఆకాశము నీగొడుగు, నీకన్నులు చంద్రసూర్యులు, ఆదిశేషుఁడు నీపూపాన్పు, అన్నియు నీసొమ్మె యగును. సర్వమునకు స్వామివయిన నిన్నుఁ గొల్చిన భక్తుల భాగ్యము ఎట్టిదో చెప్పఁదరమా?

ఉ. చరణముసోఁకినట్టి శిల • జవ్వనిరూపగుటొక్క వింత, సు
స్థిరముగ నీటిపై గిరులు • దేలినదొక్కటివింత గాని మీ
స్మరణఁ దనర్చుమానవులు • సద్గతిఁజెందిన దెంతవింత? యీ
ధరను ధరాత్మజారమణ • దాశరథీకరుణాపయోనిధీ. 65

టీ. ధరాత్మజా=సీతాదేవికి, రమణ=పురుషుఁడైన వాఁడా, చరణముఁ=నీపాదమును,సోఁకినట్టిశిల=తాఁకినట్టిరాయి, జవ్వనిరూపు=యౌవనస్త్రీయొక్క రూపము అగుట, ఒక్కవింత=ఒక యాశ్చర్యము, నీటిపయిఁ=నీటిమీద, గిరులు=కొండలు, సుస్థిరమునఁ=మిక్కిలి నిలుకడఁగా, తేలినది తేలుచుండినది, ఒక్కటివింత=మఱియొక ఆశ్చర్యము, కాని, మీ స్మరణఁ మిమ్ము స్మరించుటయందు, తనర్చుమానవులు=ఒప్పునట్టి మనుష్యులు,

ఉ॥ భూపలలామ రామ రఘు • పుంగవ రామ త్రిలోక రాజ్యసం
స్థాపన రామ మోక్షఫల • దాయక రామ మదీయపాపముల్
పాపఁగదయ్య రామ నిను • బ్రస్తుతిసేసెదనయ్య రామ సీ
తాపతిరామ భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 63

టీ. భూపలలామ = రాజులకు శ్రేష్ఠుఁడైన, రామ = రామా, రఘు పుంగవ = రఘువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడైన, రామ = రామా, త్రిలోక=ముల్లోకముల యొక్క, రాజ్య=రాజ్యమును, సంస్థాపన=స్థాపించినట్టి, రామా=రామా, మోక్ష=మోక్షమనెడి, ఫల=ఫలమును దాయక= ఇచ్చునట్టి, రామ = రామా, సీతాపతిరామా = సీతకు భర్తయైనరామాఁ నిన్నుఁ బ్రస్తుతిచేసెద=పొగడెదను, మదీయపాపముల్=నాపాపములను రామ=రామా, పాపఁగదయ్య=పోఁగొట్టుమయ్య.

తా. రామా! నీవు రాజులందరిలో శ్రేష్ఠుఁడవు మఱి రఘువంశమున బుట్టినవారిలో శ్రేష్ఠుఁడవు కేవలమురాజ శ్రేష్ఠుఁడవే కాదు. ముల్లోకములను కుదురుగా నుండునట్లు ఏలునట్టిమేటివి. వానికంటె మిక్కిలి అతిశయ మోక్షఫలమును ఇచ్చువాఁడవు. అన్నిటికిని అతిశయించిన లక్ష్మియగు సీతాదేవికి భర్తవు. ఇట్టి మితిలేని అతిశయమును గలవాఁడవు గావున కోరినకోర్కు లియ్యవచ్చును. తెలిసినంతవఱకు నిన్ను పొగడెదను అపాగ్రద్ధను బట్టియైనను, నా పాపములను పోఁగొట్టినన్నుఁ గాపాడుము.

ఉ॥ నీసహజంబు సాత్త్వికము • నీ విడిపట్టు సుధాపయోధి, ప
ద్మాసనుఁడాత్మజుండు, గమ • లాలయ నీప్రియురాలు,నీకుసిం
హాసనమిద్ధరిత్రి గొడు • గాకస, మక్షులుచంద్రభాస్కరుల్
నీసుమతల్పమాదిఫణి • నీవెసమస్తముఁ గొల్చినట్టి నీ
దాసులభాగ్యమెట్టిదయ • దాశరథీ కరుణాపయోనిధీ, 64

టీ. సాత్త్వికము=సత్త్వగుణము, నీ సహజంబు=నీకు సహజమైనది
సుధాపయోనిధి=పాలసముద్రము, నీ విడిపట్టు=నీయొక్క విడిదిస్థలము.
ఆత్మజుండు=నీకొడుకు, పద్మసనుఁడు=బ్రహ్మ, నీ ప్రియురాలు,కమలాలయ
లక్ష్మీదేవి, ఈధరిత్రి=ఈభూమి, నీకు, సింహాసనము, అకసము=ఆకాశము,
గొడుగు, చంద్రభాస్కరులు=చంద్రుఁడును,సూర్యుఁడును,అక్షులు=కన్నులు,
ఆదిఫణి=ఆదిశేషుఁడు. నీకుమతల్పము=నీపూలపాన్పు, సమస్తముఁ=సర్వ.
పదార్థములును, నీవే, ఇట్టి నిన్నుఁ గొల్చినట్టి=సేవించునట్టి, నీదాసుల = నీ
దాసజనులయొక్క, భాగ్యము=పెంపుసొంపు, ఎట్టిదయ=ఎట్టిదయ్యా.

తా. రామా!సత్త్వగుణము నీస్వభావము, నీవిడిది పాలసముద్రము,
నీకొడుకు బ్రహ్మదేవుడు, నీభార్యలక్ష్మి,ఈభూమి నీసింహాసనము, ఆకాశ
ము నీగొడుగు, నీకన్నులు చంద్రసూర్యులు, ఆదిశేషుఁడు నీపూపాన్పు,
అన్నియు నీసొమ్మే యగును. సర్వమునకు స్వామివయిన నిన్నుఁ గొల్చిన
భక్తుల భాగ్యము ఎట్టిదో చెప్పఁదరమా?

ఉ. చరణముసోఁకినట్టి శిల • జవ్వనిరూపగు టొక్కవింత, సు
స్థిరముగ నీటిపై గిరులు • దేలినదొక్కటివింత గాని మీ
స్మరణఁ దనర్చుమానవులు • సద్గతిఁజెందిన దెంతవింత? యీ
ధరను ధరాత్మజారమణ • దాశరథీకరుణాపయోనిధీ. 65

టీ. ధరాత్మజా=సీతాదేవికి, రమణ= పురుషుఁడైన వాఁడా, చరణ
ముఁ=నీపాదమును,సోఁకినట్టిశిల=తాఁకినట్టిరాయి, జవ్వనిరూపు=యౌవన
స్త్రీయొక్క రూపము అగుట, ఒక్కవింత=ఒక యాశ్చర్యము, నీటిపయిఁ
నీటిమీఁద, గిరులు=కొండలు, సుస్థిరమునఁ=మిక్కిలి నిలుకడఁగా, తేలినది
తేలుచుండినది, ఒక్కటివింత=మఱియొక ఆశ్చర్యము, కాని, మీ స్మరణఁ
మిమ్ము స్మరించుటయందు, తనర్చుమానవులు=ఒప్పునట్టి మనుష్యులు,

సద్గతిన్=మోక్షమును, చెందినది=పొందినది, ఈధరన్=ఈ భూమియందు ఎంత వింత=ఎంత ఆశ్చర్యము.

తా. రామా! పాదములను తాఁకిన రాతిని స్త్రీగాఁ జేయుటయు కొండలను నీళ్ళమీఁద మునుఁగకుండునట్లు నిల్పుటయు, నాశ్చర్యములు జేసిన నిన్ను స్మరించినవారికి నీవు మోక్షము నొసగుటయొక యాశ్చర్యముకాదు.

ఉ. దైవము తల్లిదండ్రి తగు•దాత గురుండు సఖుండునిన్నె కా
భావన సేయుచున్నతఱిఁ • పాపములెల్ల మనోవికారదు
ర్భావితుఁ జేయుచున్నవి కృ• పామతివై ననుగావుమీ జగ
త్పావనమూర్తి భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ 66

టీ. జగత్పావనమూర్తి=లోకములను పవిత్రముచేయు రూపముగల వాఁడా, దైవము తల్లి, తండ్రి, తగుదాత=తగునట్టిదాత, గురుండు=గురువు, సఖుండు=స్నేహితుఁడు, నిన్నె=నీవె, కాన్=అగునట్లు, భావన సేయుచున్న తఱిన్=భావించుచున్న సమయమునందు, పాపములుఎల్లన్=పాపములన్నియును, మనో=మనస్సుయొక్క, వికార=వికారముచేత, దుర్భావితు=చెడుతలంపులు గలవానిగా, చేయుచున్నవి. గనుక కృపామతివి. ఐ=దయగల మనస్సుగలవాఁడవై, ననున్, కావుమీ రక్షింపుమా.

తా. రామా! నేను దైవముగాను, తలిదండ్రులుగాను, గురువుగాను, స్నేహితుఁడుగాను, భావించుచుండగా నా పూర్వపాపము లన్నియు జేరి నా మనస్సును కలఁచి దుష్టభావములు కల్పించి చెరుపుచున్నవి. లోకుల పాపములను బోఁగొట్ట నవతరించినవాఁడవు, కనుక నా పాపములను పోఁదోలి నన్ను కాపాడుము.

ఉ. వాసవరాజ్యభోగ్యసుఖ • వార్ధిని దేలు ప్రభుత్వ మబ్బినా
యాసకు మేరలేదు కనకాద్రిసమాన ధనంబుఁ గూర్చినన్

గాసును వెంటరాదు కని • కానక చేసిన పుణ్యపాపముల్
వీసరపోవనీవు పది • వేలకు జాలు భవంబు నొల్ల నీ
దాసుని గాఁగ నేలుకొను • దాశరథీ కరుణాపయోనిధీ. 67

టీ. వాసవ = ఇంద్రుని, రాజ్య = దొర తనమును, భోగ = అనుభవించుటవలని. సుఖ=సౌఖ్యము అనెడి, వార్ధిని=సముద్రమందు, తేలు, ప్రభుత్వము=తేలునట్టి దొరతనము, అబ్బినా=లభించినప్పటికిని, ఆసకున్, మేరలేదు=మితిగలుగదు, కనకాద్రి=బంగారుకొండతోడ, సమాన=సమానమయిన, ధనంబున్=ద్రవ్యమును, కూర్చినన్=సేకరించినను, కాసును=కాసుకూడ, వెంటరాదు=వెంబడిరాదు, కని=తెలిసియు, కానక = తెలియకయు, చేసిన=చేసినట్టి, పుణ్యపాపముల్, వీసరపోవనీవు=వెలితిపడనియ్యవు పదివేలకున్ = పదివేలఅనర్థములకును, చాలున్ = అవి చాలియుండును, వంబున్=పుట్టుకను, ఒల్లన్=ఇష్టపడను, నీ దాసునిగాఁగన్=నీ సేవకునిగా ఏలుకొను=రక్షింపుము.

తా. రామా! ఇంద్ర భోగము, ఐశ్వర్యమును కలిగినను, ఆశకు మితిలేదు. బంగారుకొండంత ధనముకూడ పెట్టినను, పోవునప్పుడుఒక కాసుకూడ వెంటరాదు. తెలిసియో తెలియకయో చేసినపాపపుణ్యములలో, చుట్టును ఆవరించుకొని కొంచెమయినను, తప్పించుకొనుటకు అవకాశమీయవు. మఱికొన్ని యనర్థములయినను, కలిగింపఁజాలును. కనుక పుణ్యపాపములు చేసి జన్మము లెత్తుటకు నాకు ఇష్టము లేదు. నీదాసునిగా చేపట్టిజన్మము లేకుండఁ గాపాడుమా.

ఉ. సూరిజనుల్ దయాపరులు • సూనృతవాదులలుబ్ధమానవుల్
వీరపతివ్రతాంగనలు • విప్రులు గోవులు వేదముల్ మహీ
భారముఁదాల్పఁగా జనులు • పావనమైన పరోపకార స
త్కార మెఱుంగ లేరకట • దాశరథీ కరుణాపయోనిధీ. 68

టీ. సూరిజనుల్=పండిత సమూహములును, దయాపరులు=దయగల వారును, సూనృతవాదులు=నిజము పలుకువారును, అలుబ్ధమానవుల్=లోభము లేని మనుష్యులును, వీరపతివ్రతాంగనలు=వీరత్వముతో పతివ్రతలైయుండు స్త్రీలును, విప్రులు=బ్రాహ్మణులు, గోవులు, వేదములు, మహీభారము=భూమియొక్క బరువును, తాల్పగాన్=ధరింపఁగా, జనులు=సామాన్యులయిన తక్కిన జనులు, పావనము=పవిత్రము ఐనపరోపకార=ఐనట్టి పరోపకారమునకు, సత్కారము=సత్కరించుట, ఎఱుంగలేరు = తెలియలేరు. వారికి ప్రతిసత్కారము సేయ నేరకున్నారనుట, అక్కట=అయో.

తా రామా! పండితులు, దయగలవారు, సత్యసంధులు, లోభము లేనివారు, మిక్కిలి పతివ్రతలయిన స్త్రీలు, బ్రాహ్మణులు, గోవులు, వేదములు యీ భూజనులను ఉద్ధరించుచున్నవి. ఇట్టి ఉపకారపరులను తక్కినజనులు ప్రత్యుపకారము సేసి పూజించుటధర్మము. అయినను అదిజనులు తెలియకున్నారు.

ఉ. వారిచరావతారమున • వారధిలోఁజొరఁబాఱిక్రోధవి
స్తారగుఁడైన యానిగమ • తస్కరవీరనిశాచరేంద్రునిం
జేరివధించి వేదముల • చిక్కెడలించి విరించికిన్ మహో
దారతనిచ్చి తీవెకద • దాశరధీ కరుణాపయోనిధీ. 69.

టీ. వారిచర + అవతారమునన్ = మత్స్యావతారమందు, వారిధిలోన్=సముద్రములోనికి, చొరఁబాఱి = వేగముగా చొచ్చి, క్రోధవిస్తార = మిక్కిలి కోపమును, పొంది, నిగమ = వేదములయొక్క, తస్కర=దొంగిలించినవాఁడైన, వీర = వీరుఁడగు, నిశాచర + ఇంద్రునిన్= రాక్షసశ్రేష్ఠుఁడైన సోమకాసురుని, చేరి=పొంది, వధించి=చంపి, వేదముల చిక్కు=వేదముల గజిబిజిని, ఎడలించి=తీసి, విరించికిన్=బ్రహ్మకు, మహోదారతన్=మిక్కిలి దాతృత్వముతో. ఈవే నీవే, ఇచ్చితికద = ఇచ్చినవాఁడవు గదా.

తా. రామా! మత్స్యావతారమునందు సముద్రములోపల వేగము గాఁ జొచ్చి మిక్కిలి కోపాతిశయముఁ గలిగినవాఁడై వేదములను దొంగిలి కొని పోయిన శూరుఁడైన మేటిరాక్షసుఁడగు సోమకాసురుని పట్టి చంపి వేదముల చిక్కు విడఁదీసి బ్రహ్మకు మరల వానిని మిక్కిలి యౌదార్యముతో నిచ్చిన వాఁడవు నీవే కాని ఎవ్వరును గారు. అట్టి నీవు నన్నును గాపాడఁదగును.

చ. కరమనురక్తి మంధరము • కవ్వముగా నహిరాజు త్రాడుగా
దొరకొని దేవదానవులు • దుగ్ధపయోధి మథించుచున్నచో
ధరణి చలింప లోకములు • తల్లడమందఁగఁ గూర్మమై ధరా
ధరము ధరించి తీవె కద • దాశరథీ కరుణాపయోనిధీ. 70

టీ. కరము=మిక్కిలి, అనురక్తిన్=అనురాగముతో, దేవ=దేవతలును, దానవులు=రాక్షసులును, మంధరము=మంధరపర్వతమును! కవ్వముగాన్, అహిరాజు=సర్పములకు రాజయినవానిని, త్రాడుగాన్, దొరకొని=పూని, దుగ్ధపయోధిన్=పాలసముద్రమును, మథించుచున్నచోన్=చిలుకు చుండఁగా, ధరణిన్=భూమి, చలింపన్=వడఁకఁగా, లోకములు=జగములు, తల్లడమందఁగన్=తల్లడిల్లఁగా, కూర్మమై=తాఁబేలువయి, ధరాధరమున్=ఆమందరపర్వతమును, ఈవె=నీవె, ధరించితికద=ఎత్తితివికదా.

తా. రామా! దేవతలును, రాక్షసులును మంధరపర్వతమును కవ్వముగాను సర్పరాజగు వాసుకిని కవ్వపుత్రాడుగాను జేసి పాలసముద్రమును జిలుకుచుండఁగా అపుడా కొండ తటాలున మునుఁగుటచేత భూమి లోకములు తల్లడిల్లుటఁ జూచి కూర్మావతారము నెత్తి కొండను వీఁపుమీఁదఁ దాల్చినవాఁడవు నీవే కదా.

ఉ. ధారుణిఁ జాప జుట్టిన వి • ధంబునఁ గైకొని హేమనేత్రుఁ డ
వ్వారిధిలోన డాఁగినను • వాని వధించి వరాహమూర్తివై

ధారుణిఁదొంటికై వడిని • దక్షిణశృంగమునన్ ధరించి వి
స్తార మొనర్చి తీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 71

టీ. ధారుణిన్=భూమిని, చాఁపన్=చాఁపగ, చుట్టిన విధంబునన్= మడతపెట్టినతీరుగా, హేమనేత్రుఁడు=హిరణ్యాక్షుఁడు, కైకొని=చుట్టి, ఎత్తుకొని, అవ్వారిధిలోనన్=ప్రసిద్ధమయిన సముద్రమునందు, డాఁగినను= దాఁచుకొనఁగా, వానిన్=ఆహిరణ్యాక్షుని, వధించి=చంపి, వరాహమూర్తి వై=పందియాకారముగలవాఁడవై, (హిరణ్యాక్షుఁడు చుట్టి కొంపోయిన) భూమిని, దక్షిణశృంగమునన్=కుడికొమ్మునందు, కుడిపంటి కోఱయందు, ధరించి=దాల్చి, విస్తారము=మఱలచాపుగా, ఈవె=నీవే, ఒనర్చితికద=చేసి తివికదా, చేసినవాడవు నీవే.

తా. దశరథరామా! హిరణ్యాక్షుఁడు భూమిని చాపచుట్టగా చుట్టి యెత్తుకొని సముద్రములోనికిఁబోయి దాచుఁకొనఁగా నీవువానినిజంపి వరాహమూర్తివయి, కుడిపంటికోఱతో భూమిని ఎత్తుకొనివచ్చి మునుపటివలె చాపుగా పఱచినవాఁడవు నీవేకాని మఱెవరును గారు. కనుక నన్నును అట్లే ఉద్ధరింపుమా.

ఉ. పెటపెట నుక్కుగంబమున • భీకరదంతనఖాంకురప్రభా
పటలము గప్పనుప్పతిలి • భండనవీధి నృసింహభీకర
స్ఫుటపటుశక్తి హేమకశి • పుఁ విదళించి సురారిపట్టి నం
తటఁ గృపఁజూచి తీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 72

టీ. ఉక్కుకంబమునన్=ఇనుపస్తంభమునందు, పెటపెట=పెటపెట మని శబ్దించునట్లు, భీకర=భయంకరమైన, దంత=పండ్లయొక్కయు, నఖ+ అంకుర=గోటిమొనలయొక్కయు, పటలము=సమూహము, వీధిన్, కప్పన్= కప్పుకొనఁగా, ఉప్పతిలి=పుట్టి, భండన=యుద్ధప్రదేశమునందు, నృసింహ= నరసింహావతారముయొక్క, భీకర = భయంకరమైన, స్ఫుట = స్పష్టమైన

పటు=కటువైన, అగు శక్తిన్=సామర్థ్యముచేత, హేమకశిపున్=హిరణ్యకశిపుని, విదళించి=చీల్చి, అంతటన్=పిమ్మట, సురారిపట్టిన్=(రాక్షసునికొడుకైన) ప్రహ్లాదుని, కృపన్=దయతో, ఈవె=నీవె, చూచితికద=చూచితినికదా (నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని చీల్చి ప్రహ్లాదుని గాపాడినవాడవు నీవేకాదా.

తా. రామా! నీవు ఉక్కుస్తంభమున పెట పెటమని నరసింహమూర్తివై పుట్టి నీ పండ్లయొక్కయు, మొగ్గలవంటి గోళ్ళయొక్కయు తెల్లని కాంతులు నిన్ను గ్రమ్మగా భయంకరమైన శక్తిచే హిరణ్యకశిపుని అట్లు చీల్చి చంపి పిదప వానికొడుకైన ప్రహ్లాదుని గాపాడిన వాఁడవేకదా నన్ను అట్లే గాపాడుము.

చ॥ పదయుగళంబు భూగగన • భాగములన్ వెసనూనివిక్రమా
స్పదమగుసబ్బలీంద్రు నొక • పాదమునందలక్రిందనొత్తిమే
లొదవజగత్త్రయంబు బురు • హూతునకీయవటుండవైనచి
త్సదమలమూర్తివీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 73

టీ. పదయుగళంబు=పాదముల జంటను, భూ=భూమియొక్కయు, గగన=ఆకాశము యొక్కయు, భాగములన్=ప్రదేశములయందు, (ఒకకాలు భూమియందును, మఱియొకకాలు ఆకాశమందును). వెసన్=త్వరగా, ఊని=నిలిపి, విక్రమ=పరాక్రమునకు, ఆస్పదము=స్థానము, అగు సబ్బలీంద్రున్=అయినట్టి ఆ బలిచక్రవతిని, ఒక పాదమునన్=ఒకకాలిచే, క్రిందన్=క్రిందుగా, తలన్=తలను, ఒత్తి=అదిమి, మేలు-శ్రేయస్సు, ఒదవన్=కలుగఁగా, పురుహూతునకున్=ఇంద్రునికి, జగత్రయంబున్=లోకములమూటిని ఇయ్యన్=ఇచ్చుటకు, వటుండవు=వడుగవు, ఐన, చిత్=జ్ఞానమును, సత్=ఉనికియు, లేక సత్యమును అయిన, అమల=నిర్మలమగు, మూర్తివి=విగ్రహము గలవాఁడవు, నీవెగద=నీవేకాదా.

తా. ఒక పాదము భూమియందును, మఱొకటి ఆకాశమునందును పెట్టియిట్లు రెండుపాదములచే లోకమాక్రమించి మహాపరాక్రమవంతుడైనబలి చక్రవర్తితలమీఁద నొకపాదముపెట్టి పాతాళమునకు అణఁగఁద్రొక్కి మేల గునట్లు ముల్లోకములను ఇంద్రునకు ఇచ్చుటకై వటువుగాబుట్టిన సచ్చిదానంద మూర్తివి నీవేకాని మఱియెవ్వరునుగారు, కనుక నన్ను కావుమా.

చ॥ ఇరువదియొక్కమాఱు ధర • ణీశుల నెల్లనధించి తత్కళే
బరరుధిరప్రవాహమునఁ • బైతృకతర్పణ మొప్పఁజేసి భూ
సురవరకోటికిన్ ముదము • సొప్పడ భార్గవ రామమూర్తివై
ధరణ్ నొసంగితివె కద • దాశరథీ కరుణాపయోనిధీ. 74

టీ. ఇరువదియొక్కమాఱు=ఇరువదియొక్క పర్యాయములు, ధరణీశులన్ = రాజులను, ఎల్లన్=అందఱిని, వధించి=చంపి, తత్=వారియొక్క కళేబర=దేహములయొక్క, రుధిర=నెత్తుటియొక్క, ప్రవాహమునన్=వెల్లువచేత, పైతృకతర్పణము=పితరులకు జలతర్పణము, ఒప్పన్=తగునట్లు, చేసి భూసురవరకోటికిన్=బ్రాహ్మణశ్రేష్ఠుల సమూహమునకు, ముదము=సంతోషము, చొప్పడన్=కలుగునట్లు, భార్గవరామమూర్తివివై=భార్గవరాముడుగా అవతరించిన వాడవై, ధరణిన్=భూమిని, ఈవె=నీవే, ఒసంగితివికదా=దానముచేసితివికదా.

తా. రామా! రాజులనందఱిని ఇరువదియొక్క పర్యాయములు చంపి వారిదేహముల నెత్తుటివెల్లువలచేత పితరులకు జలతర్పణమిచ్చి వారియొద్దనుండి జయించిన భూమిని బ్రాహ్మణ సమూహమునకు సంతోషముకలుగునట్లు దానముచేసిన పరశురాముఁడవు నీవే యగుదువు.

చ॥ దురమునఁదాటకందునిమి • ధూర్జటివిల్ దునుమాడిసీతనుం
బరిణయమంది తండ్రి పను • పన్ ఘనకాననభూమి కేఁగిదు

స్తరపటుచండ కాండకులి • శాహతిరావణకుంభకర్ణ భూ
ధరములఁగూల్చితీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 75

టీ. దురమునన్=యుద్ధమున, తాటకన్=తాటకను, దునిమి=చంపి, ధూర్జటివిల్=శివునివిల్లు, తునుమాడి=విఱచి, సీతనున్=సీతాదేవిని, పరిణయము అంది=పెండ్లాడి, తండ్రి, పనుపన్=అడవికిపంపఁగా, ఘన=గొప్పదైన కాననభూమిన్=అరణ్యమునకు, ఏగి=పోయి, దుస్తర=సహింపరానిదియు, పటు=పటుత్వముగలదియు, చండ=తీక్ష్ణమైనదియు, అగు, కాండ=బాణము అనెడి, కులిశ=వజ్రముయొక్క, ఆహతిన్=దెబ్బచేత, రావణకుంభకర్ణ=రావణుఁడు కుంభకర్ణుఁడు అను భూధరములన్=కొండలను, ఈవె=నీవె, కూల్చితికద=కూలవయిచితివికదా!

తా. రామా! యుద్ధమున తాటకను చంపి, శివునివిల్లువిఱిచి, సీతను పెండ్లాడి, తండ్రి పంపఁగా ఘోరడవికిపోయి వజ్రాయుధముచేత కొండలను గూల్చినట్లు హరింపరాని వాఁడిబాణమున రావణకుంభకర్ణులను గూల్చినవాఁడవు నీవే యగుదువు.

చ. అనుపమయాదవాన్వయసు • ధాబ్ధిసుధానిధికృష్ణమూర్తినీ
కనుజుఁడుగాజనించి కుజ • నావళినెల్ల నడంచి రోహిణీ
తనయుఁడనంగ బాహుబల•దర్పమునన్ బలరామమూర్తివై
తనరినవేల్పు వీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 76

టీ. అనుపమ=సాటిలేని, యాదవ అన్వయ=యాదవవంశముఅనెడి, సుధాఅబ్ధి=పాలసముద్రమునకు, సుధానిధి=చంద్రుఁడగు. (పాలసముద్రమునుఉప్పొంగఁజేయు చంద్రునివలె యాదవవంశమును వర్ధిల్లఁజేయువాఁడై) కృష్ణమూర్తి=కృష్ణుఁడు, నీకున్, అనుజుఁడుగాన్=తమ్ముఁడు అగునట్లుగా, రోహిణీతనయుఁడుఅనంగన్=రోహిణీదేవికుమారుఁడు అని జనులాడఁగా, జనించి=పుట్టి, బాహుబల=భుజముల బలిమిచేతనైన, దర్పమునన్=గర్వముచేత, కుజన+అవళిన్ ఎల్లన్=చెడ్డవారలసమూహమును అంతయు, అడంచి=

అడఁగఁద్రొక్కి, కీబలరామమూర్తివై = బలరామావతార మెత్తినవాఁడవై తనరినవేల్పవు = ఒప్పునట్టి దేవుఁడవు. ఈవెకద = నీవేకదా.

తా. రామా! యాదవవంశ తిలకుఁడైన కృష్ణుఁడు తమ్ముఁడుగా రోహిణీదేవి కడుపునఁబుట్టి భుజబలాతిశయముచేత దుష్టసమూహములనెల్ల రూపుమాపి బలరాముఁడుగా నవతరించిన దేవుఁడవు నీవేయగుదువు.

చ. సురలునుతింపఁగాఁ త్రిపుర • సుందరులన్ వరియింపబుద్ధరూ
పరయఁగఁ దాల్చితీవు త్రిపు • రాసురకోటి దహించునప్పుడా
హరునకుఁదోడుగా వరశ • రాసన బాణ ముఖోగ్రసాధనో
త్కరమొనరించి తీవెగద • దాశరథీ కరుణాపయోనిధీ. 77

టీ. అరయఁగన్ = విచారింపఁగా, సురలు = దేవతలు, నుతింపఁగాన్ = పొగడఁగా, త్రిపురసుందరులన్ = త్రిపురములందలి స్త్రీలను, వరియింపన్ = వరియించుటకై, బుద్ధరూపు = బౌద్ధమూర్తిని, ఈవు = నీవు, తాల్చితి = ధరించితివి, త్రిపుర = త్రిపురములలో నివసించు, అసురకోటిన్ = రాక్షస సమూహములను, దహించునప్పుడు, ఆహరునకున్ = శివునకు, తోడుగాన్ = సాహాయ్యముగా, వర = శ్రేష్ఠమైన, శరాసన = విల్లు, బాణ = బాణము, ముఖ = మొదలయిన, ఉగ్ర = భయంకరమగు, సాధన = పరికరములయొక్క, ఉత్కరము = సమూహము, ఈవే = నీవే, ఒనర్చితికదా = చేసితివిగాదా.

తా. దేవతలు ప్రార్థింపఁగా త్రిపురములందలి స్త్రీలను మోహించుకొ అను బౌద్ధవిగ్రహము దాల్చినవాఁడవు నీవే! త్రిపుర రాక్షససమూహములను కాల్చునప్పుడు శివునికి విల్లు అమ్ము మొదలయిన పరికరముల సవరించి సాహాయ్యము చేసినవాఁడవు నీవే. ఇట్లు దుష్టులను నిగ్రహించి శిష్టులను రక్షించు నీవు నన్నును రక్షింపుమా.

ఉ. సంకరదుర్గమై దురిత • సంకులమైనఁ జగంబుఁజూచి స
ర్వాంకషలీల నుత్తమతు • రంగమునెక్కి కరాసిఁబూని పే

రాంకవిలాస మొప్పఁగలి • కాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్చితివుకద • దాశరథీ కరుణాపయోనిధీ, 78

టీ, సంకర= సంకరముచేత, దుర్గమై=ప్రవేశింపరానిదై, దురిత= పాపముచేత, సంకులము=వ్యాపించినది. ఐన జగంబు= అయినట్టిలోకమును, చూచి, సర్వంకష= అన్నిటిని ఒరయుచున్న, లీలన్=విలాసముతో, ఉత్తమతురంగము=మేలయిన గుఱ్ఱమును, ఎక్కి, కర+అసిన్= చేతికత్తిని, పూని-తాల్చి, వీర+అంకవిలాసము = వీర అంకవీడు వాడమట, పరాక్రమము,ఒప్పన్= ఒప్పుచుండఁగా కలిక ఆకృతిన్-కల్కి ఆకారముతో (కల్కి-అవతారమెత్తి) సజ్జనకోటికిన్ ఉత్తమసమూహమునకు, నిరాంతకము = ఆతంకము లేని, ఈవె=నీవె, ఒనర్చెదుకద=చేయబోయెదవుకదా.

తా. రామా! వర్ణసంకరము మిక్కిలి బలమయిన పాపమునిండి యున్న జగముజూచి మిక్కిలి లీలతో గొప్పగుఱ్ఱమునెక్కి చేతిగత్తిదాల్చి పరాక్రమము విలాసము తెలియునట్లు, కలికిమూర్తివై సజ్జనులకు దురాచారవర్ణ సంకరాది దోషములు లేకుండునట్లు, ఇఁక చేయఁగలవాఁడవు నీవే యగుదువు.

చ. మనమునకూహాపోహణలు • మర్వకమున్నె కఫాధిరోగముల్
దనువుననంటి మేనిబిగి • దప్పకమున్నె నరుండు మోక్షసా
ధన మొనరింపఁగావలయు • దత్త్వవిచారము మానియుంచుట
ల్తనువునకుర్వి విరోధమిది • దాశరథీ కరుణాపయోనిధీ. 79

టీ. మనమునన్=మనస్సునందు, ఊహాపోహణలు= ఊహాపోహాలు, మర్వకమున్నె=మరచిపోవకమునుపే, కఫాదిరోగముల్=కఫము మొదలయిన జబ్బులు, తనువునన్ = దేహమునందు, అంటి = కలిగి, మేనిబిగి = దేహముయొక్క బలము, తప్పకమున్నె, నరుండు = మనుష్యుఁడు, మోక్ష సాధనము, మోక్ష=మోక్షమునకు, సాధనము=సాధించు ఉపాయము, ఒన

రింపవలయున్ = చేసికొనఁగావలయును, తత్త్వ-వస్తువుల కలరూపును, విచా
రము=పరిశీలనము, మానియుండుటల్=వదలియుండు కార్యములు, తనువు
నకున్=దేహమునకు, అది, విరోధము=విరుద్ధమైనది,

తా. రామా! మనస్సునకు ఊహించుశక్తియు, దలంచుకొను శక్తి
యు తగ్గకమునుపు, కఫము మొదలయిన రోగములు దేహమున ప్రవేశించి
బలముతగ్గకమునుపును, మనుష్యుఁడు తత్త్వవిచారముచేసి మోక్షమునకుఁదగిన
సాధనములను, చేసికొనవలయును. పిదప చేసికొనుటకు సాధ్యముకాదు.
తత్త్వవిచారము సేయకుండుట ఆత్మస్వరూపమునకు విరుద్ధమగును.

చ. ముదమున కాటపట్టు భవ • మోహమదద్విరదాంకుశంబు సం
పదలకొటారు కోరుకుల • పంట పరంబునకాది వైరుల
న్నదన జయించుత్రోవ విప • దబ్ధికినావ గదా సదా భవ
త్సదమలనామసంస్మరణ • దాశరథీ కరుణాపయోనిధీ. 80

టీ. భవత్=నీయొక్క, సత్=శ్రేష్ఠమును, అమల = నిర్మలమునైన
నామ=నామముయొక్క, సంస్మరణ=మిక్కిలి స్మరించుట, ముదమునకున్=
సంతోషమునకు, ఆటపట్టు=స్థానము, భవ=పుట్టుకయును, మోహ=అజ్ఞాన
ము అనెడి, మదద్విరద=మదపుటేనుగులకు, అంకుశంబు=అంకుశము, సంపదల
కొటారు=సంపత్తులుచేర్చియుండెడికొట్టు కోర్కులనెల్లసఫలముగాఁజేయున
దనుట, పరంబునకున్=పరలోకమునకు, ఆది=మొదలు, వైరులన్=శత్రువు
లను, అదనన్=సమయముఁజూచి, జయించుత్రోవ = గెలుచుమార్గము,
విపత్ + అబ్ధికిన్=ఆపదనెడి సముద్రమునకు, నావ=ఓడ, సముద్రము
నుదాటించు ఓడవలె ఆపదలను పోఁగొట్టుననుట) కదా=అగును.

తా. రామా! నిర్మలమైన నీనామమును ధ్యానించుట సంతోషము
కలిగించును; అంకుశముచే ఏనుఁగును, అణఁచునట్లు యెడతెగక యుండుజన్మ
పరంపరను తగ్గించును; సకలసంపదలను ఇచ్చును; కోరికలనెల్ల సఫలము

గావించును; పరలోకమునకు మూలము; పగవారిని గెలుచుటకు సాధనమైనది; సముద్రమును దాటించునోడవలె ఆపదలను పోగొట్టును.

చ. దురితలతానుసారిభవ • దుఃఖకదంబము రామనామ భీ
కరతరహేతిచేఁ దెగి వ • కావకలై చనకుండ నేర్చునే
దరికొని మండుచుండుశిఖి • దార్కొనినన్ శలభాదికీటకో
త్కరము విలీనమై చనదె • దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. దురిత=పాపమనెడు, లత=తీఁగను, అనుసారి= అనుసరించుచున్న భవ=పుట్టుకలనెడి, దుఃఖకదంబము=దుఃఖసమూహము, రామనామ=రామనామము అనెడి, భీకరతర=మిక్కిలి భయంకరమైన, హేతిచేన్ = కత్తిచేత, తెగి, వకావకలై=భిన్నభిన్నమై చనకుండ నేర్చునే = పోకుండఁజాలునా, దరికొని = తగులుకొని, మండుచుండుశిఖిన్ = జ్వలించుచున్న అగ్నిని, దార్కొనినన్ = మీఁదపడఁగా, శలభ= మిడుతలు, ఆది= మొదలయిన, కీటక=పురుగుల, ఉత్కరము=సమూహము, విలీనమై=మిక్కిలి అణఁగి పోయినదయి, చనదె=పోదా, నశించియే పోవునని భావము.

తా. రామా! పాపము పయిపయిరాఁగా దానితోఁ గూడ సాఁగు దుఃఖాత్మకమయిన జన్మపరంపర, కత్తిచేత తీఁగ త్రెంపఁబడునట్లు, నీరామనామముచే నశించి పటాపంచలై, రగిలి మండుచున్న అగ్నియందుబడిన మిడుతలు మొదలయిన పురుగులవలె రూపుమాసి పోవును.

చ. హరిపదభక్తినింద్రియజ • యాన్వితుఁడుత్తముఁడింద్రియంబు
మరుగకనిల్పునాదిననుమధ్యముడింద్రియపారవశ్యుడై (లక్)
పరగినచోనికృష్టుఁడనిపల్కఁగ దుర్గతినైననన్ను నా
దరమున నెట్లుకాచెదవొ • దాశరథీ కరుణాపయోనిధీ. 82

టీ. హరిపదభక్తి=విష్ణువు పాదములందలి భక్తిచేత, ఇంద్రియ=ఇంద్రియములను, జయ=గెలుచుటతోడ, అన్వితుడు=కూడినవాఁడు, ఉత్త

ముఁడు=శ్రేష్ఠుఁడు, ఇంద్రియంబులన్=ఇంద్రియములందు, మరగక=లీనుఁడుగాక (ఇంద్రియములు పోయినదారినిపోక) నిల్పన్=దానినిగ్రహించుటకు, ఊదినను=ప్రయత్నించినయెడల, మధ్యముఁడు=నడితరపువాఁడు; ఇంద్రియ=ఇంద్రియములకు, పారవశ్యుఁడై = అధీనుఁడై, పరిగినచోన్ = ప్రవర్తించిన యెడల, నికృష్టుఁడు=అధముఁడు, అని పల్కఁగాన్=చెప్పఁగా, దుర్మతిని = దుష్టబుద్ధిని, ఇంద్రియములకు లోనయినవాడను, ఆదరమునన్=ఆదరింపుతో, ఎట్లు కాపాడెదవో.

తా. దశరథరామా! విష్ణుపదభక్తితో ఇంద్రియములను గెలిచిన వాఁడు ఉత్తముఁడు; ఇంద్రియములకు లోనుగాక నిగ్రహింపక ప్రయత్నించినవాడు మధ్యముడు; ఇంద్రియములకు అధీనుఁడయినవాడు అధముఁడు ఈ ముగ్గురిలో దుష్టబుద్ధినయిన నేను అధముడను గనుక రక్షింపఁ దగినవాడనుగాను అయినను నన్నెట్లు రక్షించెదవో తెలియదు

చ. వనకరి చిక్కె మైనసకు • వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁ జిక్కెఁ జిల్వ గనుఁ • వేఁదుఱు జెందెను లేళ్లు తావిలో
మనికి నశించె దేటి తర • మా యిరుమూటి నిగెల్వ నైదు సా
ధనముల నీవెకావదగు • దాశరధీ కరుణాపయోనిధీ. 83

టీ. వనకరి=అడవియేనుఁగు, మైనసకున్=దేహమునందలి చాపల్యమునకు, (ఏనుగు పట్టుకొనువాండ్రు ఆకర్షించుటకై విడుచు ఆడఏనుగు దేహమునుజూచి కామించియనుట) చిక్కెన్= చిక్కువడెను మీను=చేప వాచవికిన్ = నోటిరుచికి (గాలమునందు గ్రుచ్చిన యెఱ్ఱ యందలిరుచికి చెడిపోయెన్ = తగులు పడిచెడెను, చిల్వ = పాము, తాన్ = తాను వినికికిన్ = వినుటకు, (పాములవాఁడు ఊదు స్వరమును వినుటకు చిక్కె = చిక్కు పడెను, లేళ్లు, కనుఁ వేఁదుఱు = కంటిపిచ్చి, చెందెను పొందెను (చక్షురింద్రియములకు లోనయ్యె) తేఁటి = తుమ్మెద, తావిలో= వాసనలో, మనికిన్ = ఉండుటచేత, నశించెను, (ఘ్రాణేంద్రియమునకు

లోనయ్యె, పూఁదేనె వాసనకై తామరపూవులో చొచ్చి అది ముడుచు
కొనఁగా లోపల చిక్కుకొనెననుట) ఇరుమూఁటిని=ఐదిఁటిని, (ఐదు ఇంద్రి
యములను) గెల్వన్=జయించుటకు, తరమా=శక్యమా, ఐదుసాధనములన్=
పంచవిధములైన ఉపాయములుచేత, నీవె కావఁదగున్=నీవే కాపాడ
వలయును.

తా. దాశరథీ! అడవిలో, ఏనుఁగు, ఆఁడు ఏనుఁగును జూచియు,
చేప గాలమునందలి యెరచవికిని, పాము పాములవాని ఊనుస్వరమును విను
టకును, లేఁడి కనుపిచ్చిచేతను, తుమ్మెద తామరలోని పూదేనెవాసనకును
లోనయ్యు చిక్కుకొనుచున్నవి. అయిదు యింద్రియములను గెలువ నెవ్వరి
తరము ? కనుక ఇంద్రియలోలుఁడైన నాకును మోక్షము గలుట కష్టము
గావున పంచేంద్రియముల నిన్నుగొల్చు పంచవిధకైంకర్యములచేత యింద్రియ
ముల నడఁచి నన్ను కాపాడుమా.

చ. కరములుమీకుమ్రొక్కులిడ • గన్నులుమిమ్మునెచూడజిహ్వ
మీ, స్మరణఁదనర్పవీనులుభ • వత్కథలన్వినుచుండనాసమీ
యఱుతను బెట్టుపూసరుల • కాసగొనం బరమార్థసాధనో
త్కరమిదిచేయవే కృపను • దాశరథీ కరుణాపయోనిధీ. 84

టీ. కరములు=చేతులు, మీకున్, మ్రొక్కులిడన్ = దండములు
పెట్టఁగాను, కన్నులు, మిమ్మునె, చూడన్=చూడఁగాను, జిహ్వ=నాలుక,
మీస్మరణన్=మిమ్ము స్మరించుటచేత, తనర్పన్ = ఒప్పఁగాను, వీనులు=
చెవులు, భవత్ కథల్=మీదైనచరిత్రములను. వినుచుండన్=వినుచుండఁ
గాను, నాస=ముక్కు, మీయఱుతను=మీమూఁపునందు, పెట్టు పూసరుల
కున్=పెట్టునట్టి పూదండలకు, ఆసగొనన్ = ఆసపడఁగాను, అది = అట్లు
ఆయా అవయవములు మీకు ఆయాకార్యములు సేయుట, పరమార్థ = సరి
యైన, సాధన=పురుషార్థములను సాధించెడి యుపాయముయొక్క, ఉత్క

రము=సమూహము. (ఐదుఅవయవములను చెప్పిన అయిదువ్యాపారములే పురుషార్థములను సాధించుటకు ఉపాయము,)

తా. చేతులు మీకు మ్రొక్కుటయు, కన్నులనిమ్ముగ జూచుటయు' నాలుక మీ నామమును జపించుటయు, చెవులు మీకథలను వినుటయు, ముక్కు మీమూఁపునందలి పూదండలను గోరుటయు ననెడి యీయైశ్వర్యములే మోక్షమునకు సిద్ధికరమైన సాధనములు.

చ. చిరతరభక్తినొక్క తుల • సీదళమర్పణ సేయువాఁడు ఖే
చరగరుడోరగప్రముఖ • సంఘములో వెలుఁగన్ సదాభవ
త్స్ఫురదరవిందపాదములఁ బూజలొనర్చినవారికెల్లఁ ద
త్పర మరచేతి ధాత్రిగద • దాశరథీ కరుణాపయోనిధీ. 85

టీ. చిరతరభక్తిన్=బహుకాలముగానున్న భక్తితో, ఒక్క తులసీదళము=ఒక్క తులసియాకు, అర్చనసేయువాఁడు=సమర్పించినవాఁడు, ఖేచరులు, గరుడులు, ఉరగులు, అను వీరియొక్క సమూహములోపల, వెలుఁగున్=ప్రకాశించును, సదా=ఎప్పుడును, భవత్=నీయొక్క, స్ఫురత్ = ప్రకాశించుచున్న, అరవింద=తామరలవంటి, పాదములన్=అడుగులను, పూజలు ఒనర్చినవారికెల్లన్=పూజించిన వారికందరికిని, తత్పరము = ఆమోక్షము, అరచేతిధాత్రి=అరచేతి యుసిరికవలె, కదా=అగును.

తా. రామా! బహుకాలము భక్తితోడ ఒక్కతులసి దళమునునీకు సమర్పించినవారు ఖేచరులు, గరుడులు, ఉరగులు అను వీరిలో నొక్కఁడై ప్రకాశించును. ఇఁక ఎప్పుడును, నీపాదారవిందములను బూజజేయువారి కందఱికి మోక్షము కరతలామలకమే కదా.

ఉ. భానుడుతూర్పునందుఁగను • పట్టినఁబావకచంద్రతేజముల్
హీనతఁ జెందినట్లు జగ • దేకవిరాజితమైన నీపద

ధ్యానము సేయు చున్నఁ బర • దైవమరీచులడంగకుండునే
దానవగర్వనిర్దళన • దాశరథీ కరుణాపయోనిధీ. 86

టీ. దానవ=రాక్షసులయొక్క, గర్వ=గర్వమును, నిర్దళన=హరించువాఁడా, భానుడు=సూర్యుఁడు, తూర్పునందు = తూర్పుదిక్కునందు, కనుపట్టినన్=కనబడఁగా, పావక=అగ్నియొక్కయు, చంద్ర = చంద్రుని యొక్కయు, తేజముల్=కాంతులు, హీనత చెందినట్లు, జగదేక=లోకమునకు ముఖ్యముగా, విరాజితము=ప్రకాశించునది, ఐన, నీపదధ్యానము- అయినట్టి నీపాదములను ధ్యానించుట, చేయుచున్నన్=చేయుచుండఁగా, పరదైవమరీచులు=ఇతరదైవముల కాంతులు, అడంగకుండునే=అణఁగిపోవకుండునా.

తా. సూర్యునికాంతికి అగ్ని మొదలగు వానికాంతులుతగ్గునట్లు జగత్తంతయు ప్రకాశించుచున్న నీపదధ్యానముయొక్క ప్రకాశమునకు ఇతర దేవతల ప్రకాశములు అడఁగిపోవును.

ఉ. నీ మహనీయతత్త్వరస • నిర్ణయబోధకథామృతాబ్ధిలోఁ
దాముసు గ్రుంకులాడక వృ • థాతనుకష్టము జెందిమానవుం
డీమహి లోకతీర్థముల • నెల్లమునింగిన దుర్వికారహృ
త్తామసపంకముల్ విడునె • దాశరథీ కరుణాపయోనిధీ. 87

టీ. నీ, మహనీయ= గొప్పదైన, తత్త్వరస=తత్త్వసారముయొక్క నిర్ణయ=నిశ్చయముగల, సిద్ధాంతము గలినట్టి, బోధ=జ్ఞానముకలిగిన, కథా=కథలనెడి, అమృతాబ్ధిలోన్=అమృతమయమైన సముద్రమునందు, తాన్=తాను, మును=ముందు, గ్రుంకులాడక=మునుఁగక, వృథా=వ్యర్థముగా, తనుకష్టమున్=శరీరసంకటమును, చెంది=పొంది, మానవుండు=మనుష్యుఁడు ఈ మహిలోక తీర్థములన్ ఎల్లన్=తీర్థములనంతటను, మునింగినన్=గ్రుంకఁగా, దుర్వికార=చెడువికారములుగల, హృత్=హృదయముయొక్క తామస=తమోగుణ సంబంధియైన కార్యములనెడి, పంకముల్= రొంపులు విడునె=విడిచిపోవునా.

తా. రామా! నీమహిమయొక్క సారమిట్టిదని నిర్ణయించి తెలుపు నీదివ్యచరిత్రమనెడి యమృతసముద్రమందుము ంచుగుంపబడిననే దుర్వికారమైన హృదయమందలి తామసములనెడి రొంపులు తీసిపోవునుగాని కేవలము ఈ భూలోకమునందలి తీర్థములందు! మునిగినయెడల అవితీసిపోవు.

ఉ. కాంచన వస్తుసంకలిత • కల్మష మగ్నిపుటంపు పెట్టి వా
రించినరీతి నాత్మనిగి • డించిన దుష్కర దుర్మలత్రయం
బంచితభక్తియోగదహ • నార్చిఁ దగుల్పక పాయునేకన
త్కాంచనకుండలాభరణ • దాశరథీ కరుణాపయోనిధీ. 88

టీ. కనత్=ప్రకాశించుచున్న, కాంచన=బంగారమయమైన, కుండల కుండలములు, ఆభరణ=సొమ్ముగాఁగలవాఁడా, కాంచనవస్తు=బంగారు పదార్థముసందు, సంకలిత=మిక్కిలి తగిలిన, కల్మష=మాలిన్యము, అగ్నిపుటంబుపెట్టి=అగ్నిపుటమువేసి, వారించినరీతిన్ = తొలఁగించినవిధమున దుష్కర=చేయరాని, దుర్మలత్రయంబు = చెడ్డవియైన మూఁడుమలములను (మనోవాక్కాయముల మూఁటియొక్క మాలిన్యములను) అంచిత=ఒప్పున్న భక్తియోగమనెడి, దహన=అగ్నియొక్క, అర్చిన్=జ్వాలయందు, తగుల్పక, పాయునే=విడిచిపోవునా?

తా. రామా! బంగారులోని మలినము అగ్ని పుటమువలన పోవునట్లు ఆత్మయందుఁగల పాపములు నీయందలి భక్తియోగముచేతనే, నశించునుగాని మఱొకవిధమున పోవు.

ఉ. నీసతి పెక్కుగల్మలిడ • నేర్పరి, లోక మకల్మషంబుగా
నీసుతసేయు పావనము • నిర్మితకార్యధురీణదక్షుఁడై
నీసుతుఁడిచ్చునాయువులు • నిన్నుభజించినఁ గల్గకుండునే
దాసుల కీప్సితార్థములు • దాశరథీ కరుణాపయోనిధీ. 89

టీ. నీసతి=నీభార్య, పెక్కు_కల్మిలు=అనేకసంపదలు, ఇడన్=ఇచ్చుటకు, నేర్పరి=నిపుణురాలు, నీసుత=(నీ పాదములయందుఁబుట్టుటచే,) నీకూతురైన గంగ, లోకము=జగము, అకల్మషంబుగాన్ = నిర్దోషముగునట్లుగా, పావనము సేయున్=పవిత్రముగాఁజేయును, నీసుతుడు=నీకొడుకయిన బ్రహ్మ, నిర్మితకార్య=నిర్మాణకృత్యముయొక్క, (సృష్టికార్యముయొక్క), ధురీణ=భారముగల, దక్షుఁడై=నేర్పరియై, ఆయువులు=ఆయుష్యములు, ఇచ్చును, నినున్=ఇట్టి (భార్యయు కూఁతురును కొడుకునుగల) నిన్ను, భజించినన్=కొలువఁగా, దాసులకున్=నీభక్తులకు, ఈప్సిత=కోరికలు, కలుగకుండు నే=లభింపక పోవునా.

తా. రామా! నీభార్యయైన లక్ష్మి సమస్తసంపదలనిచ్చుటకు సమర్థురాలు. నీకూతుఁరైనగంగ ముల్లోకములందును ప్రవహించి లోకములందలి పాపములను పోఁగొట్టి పవిత్రముగాఁ జేయును. నీకొడుకైన బ్రహ్మ సృష్టికార్యమంతయు నిర్వహింప సమర్థుఁడై ఆయువుల నిచ్చును. ఇట్టి పుత్రకళత్రాదులుగల నిన్ను భజించిన నీభక్తులకు కోరినకోర్కులు నెరవేరకపోవు.

ఉ॥ వారిజపత్రమం దిడిన • వారి విధంబున వర్తనీయమం
దారయ రొంపిలోన దను • వంటని కుమ్మర పుర్వురీతి సం
సారమునన్ మెలంగుచు వి•చారగుఁడై పరమొందుగాదె స
త్కార మెఱింగి మానవుఁడు• దాశరథీ కరుణాపయోనిధీ. 90

టీ. వారిజపత్రమందు=తామరాకునందు, ఇడినవారివిధంబునన్=ఉంచిన జలమురీతిని, అరయన్=విచారింపగా, రొంపిలోనన్=బురదయందు, తను=దేహము, అంటని కుమ్మరిపుర్వురీతిన్=తగులుకొనని కుమ్మరిపురుగు విధమునను, సంసారమందు, మానవుఁడు=మనుష్యుడు, మెలంగుచున్=ప్రవర్తించుచు, విచారగుఁడై=తత్త్వవిచారమును పొందినవాఁడై, సత్కారము=(నిన్ను పూజించుటకు) ఎఱింగి=తెలిసి, పరమున్=మోక్షమును, ఒందున్ కాదె=పొందునుగదా.

తా. రామా! తామరాకునందలి నీటిచుక్క లేక బిందువు. ఆతామ రాకును ఎట్లు అంటుకొనదో, రొంపిలో మున్మ్రరపురుగు మెలఁగినను దాని దేహమునకు బురద అంటు కొనక యెట్లుండునో, అట్లే పురుషుఁడైనవాడు సంసారమందు ప్రవర్తించుచుండినను తత్త్వవిచారమునుపొంది సంసారమున తగులుబడక మోక్షమును పొందునుగదా.

ఉ॥ ఎక్కడి తల్లిదండ్రి సుతు • లెక్కడివారు కళత్ర బాంధవం
బెక్కడజీవుఁ డెట్టి తను • వెత్తినఁబుట్టుచుఁ బోవుచున్నవా
డొక్కఁడెపాపపుణ్యఫల • మొందిన నొక్కఁడెకాన రాడు వే
ఱొక్కడుఁ వెంటనంటిభవ • మొల్లనయాకృప జూడవయ్య నీ
తక్కరిమాయలం దిడక • దాశరథీ కరుణాపయోనిధీ 91

టీ. ఎక్కడితల్లిదండ్రి=తల్లిదండ్రియు ఎక్కడివారు (తల్లితండ్రిఅని చెప్పుకొనుటేకాని నిజముగా వారితో సంబంధమేమియులేదు.) సుతులు= కొడుకులు, ఎక్కడివారు=వారితోడి సంబంధమెక్కడిది, కళత్రబాంధవం బు=పెండ్లామనెడిచుట్టరికము, ఎక్కడ=ఏమిసంబంధము, ఏలయనఁగా జీవు డు=దేహధారి, ఎట్టితనువు=ఎట్టిదేహమును, ఎత్తినన్=ధరించినను, (ఎంతటి గొప్పజన్మము ఎత్తినవాఁడైనను) ఒక్కఁడే=తాను ఒక్కఁడే, పుట్టుచున్= జన్మించుచును, పోవుచున్=మరణించుచు, ఉన్నవాఁడు (తల్లిదండ్రి, కొడుకులు పెండ్లము అని యిందఱు ఒక జీవునికి మిక్కిలి సంబంధించినవారుగా కనఁ బడుచున్నారు, గాని నిజము విచారింపఁగా వాఁడు పుట్టినప్పుడు ఒక్క డుగానే పుట్టి వచ్చుచున్నాఁడు. చచ్చునప్పుఁడు ఒక్కఁడుగానే చచ్చిపోవు చున్నాఁడు. అప్పుడుకూడ పెండ్లము బిడ్డలెవరును వచ్చుటయు లేదు. పోవు టయు లేదు. కాన తక్కినవారితోడి సంబంధ మేమిశాశ్వతము అని భావ ము.) పాపపుణ్యఫలము=తాను చేసిన పాపములకును పుణ్యములకును కలు గుఫలము, ఒందినన్=పొందఁగా, (అనుభవించునప్పుడు ఒక్కఁడేకాని, ఆఫ లమును, ఎవరును అనుభవింపరు.) వెంటనంటన్=వెంటనేపోవుటకు, వేఱు

ఒక్కఁడున్=మఱియొక్కఁడుగాఁడు, కానరాదు=కనఁబడఁడు, (పుట్టినగాని చచ్చినఁగాని పుణ్యపాప ఫల మనుభవించినగాని తానొక్కఁడే యగును) కాఁబట్టి, భవము=పుట్టుక, ఒల్లనయా=ఇచ్ఛగింపనయ్యా, (శాశ్వతసంబంధము లేక ఎంగుకును పనికిమాలిన తలిదండ్రుల కడుపునఁ బుట్టి పెండ్లము,మగట్టు కొనిబిడ్డలును గనుచుండెడి యీసంసారము నిస్సారమేకనుక అది నా కిష్ట ము లేదనుట) నీతక్కరిమాయలందు=నీకపటపుమాయలందు, ఇడక=నన్ను పెట్టక (నాతోలీలలుచూపక) కృపన్=దయతో చూడవయ్యా=చూడుమీ

తా. రామా! తల్లిదండ్రులు, కొడుకులు, పెండ్లము అనువారు నడుమ వచ్చినవారేకాని శాశ్వతముగా సంబంధించి యుండు వారుగారు, ఏలయనఁగా ఒకఁడు ఏజన్మమెత్తినపుడును, పుట్టుఁనపుడును చచ్చునపుడును పుణ్యపాపఫలము లనుభవించనపుడును తానొక్కడేయగును। గాని తలిదండ్రులు మొదలయినవారు వానితో కూడ వచ్చుటగాని పోవుటగాని అనుభవించుటగాని లేదు. కాఁబట్టిఆట్టివారి సంబంధముగల సంసారమునాకక్కఱ లేదు. నీవు నాతో వేడుకలు సేయక నిజముగా సంసారమునుండి తప్పించి నన్నుఁ గాపాడుమా.

చ. దొరసినకాయముల్ముదిమిఁ దోఁచినఁజూచిప్రభుత్వముల్సిరు
లెన్నెఱుఫులుఁగాఁగఁజూచిమఱి మేదినిలోఁదమతోడి వారుముం
దరుగుటజూచిచూచి తెగు నాయువెఱుంగక మోహపాశము
ల్దఱుగనివారికేమిగతి దాశరథీ కరుణాపయోనిధీ. 92

టీ. దొరసిన కాయముల్ = కలిగిన దేహములు, ముదిమి = ముసలి తనము, తోఁచినన్ = తోఁపఁగాచూచి, ప్రభుత్వముల్ = దొరతనములు సిరుల్=సంపదలు, మెఱుఫులుగాఁగన్=మెఱుపుతీఁగలవలె, చూచి=తెలిసి కొని, మఱి = మరిన్ని, మేదినిలోన్ = భూమియందు, దమతోడివారు= తమఁతోఁ గూడ పుట్టి పెరిగినవారు, ముందు = తమకు మునుపు, అరుగుట పోవుటను (చచ్చుటను) చూచిచూచి, తెగు అయువున్=నశించునట్టి ఆయు

ష్యమును, (ఆయువు నశింబపోవునని) ఎఱుంగక = తెలిసికొనక, మోహ
పాశముల్ = అజ్ఞానపుత్రాళ్లు (ప్రపంచ విషయములందు త్రాళ్ళవలె
బంధించు అజ్ఞానము) తఱుగనివారికిన్=తగ్గనివారికి, ఏమిగతి=ఏమిదిక్కు.

తా. రామా! శరీరములు ముదిసిపోవుట చేతను దేహము అస్థిర
మనియు, ప్రభుత్వాదులు నశించుటచే సంపదలు అస్థిరమనియు, తమతోడి
వారు ముందుగానే చచ్చి యుండుటచే తాము చావవలసిన వారనియు
చక్కఁగా తెలియుచుండినను శరీరము నశించునని తెలియక అస్థిరములైన
యీదేహాదులయందే అజ్ఞానముయొక్క బంధములచే కట్టుబడుచున్నారే!
ఇట్టివారికి గలుగఁగల స్థితియేమి? యని భావము.

చ. సిరిగలనాఁడు మైమరచి • చిక్కిననాఁడుఁ దలంచి పుణ్యముల్
పొరిఁ బొరిఁ జేయనైతి నని • పొక్కినఁ గల్గునె గాలిచిచ్చుపై
గెరలిన వేళఁ దప్పిగొని • కీడ్పడు వేళ జలంబుఁ గోరి త
త్తరమునఁ ద్రవ్వినం గలదె • దాశరథీ కరుణాపయోనిధీ. 93

టీ. సిరి=సంపద, కలనాఁడు=కలిగియుండిన దినములందును, మైమ
రచి=దేహము తెలియుట తప్పి, చిక్కిననాఁడున్=ఉన్న దినములందును,
తలంచి=ఆలోచించి, పుణ్యమున్ = పుణ్యకార్యములను, పొరిన్ పొరిన్ =
మాటిమాటికి, చేయనైతిని అని=చేయక పోయితినిఅని,పొక్కినన్=తపిం
పఁగా, కల్గునె = ఫలముకలుగునా (ఇందులకు దృష్టాంతరము) గాలి,
చిచ్చుపై=అగ్నిమీద, కెరలినవేళన్=విజృంభించినప్పుడు (ఇల్లు మొదలగు
వానిని కాల్పఁబూనిన అగ్నిని పుట్టినప్పుడే చల్లార్పక దానిపై గాలి తగిలి
మిక్కిలి రగులుకొన్న సమయమున) దప్పిగొని, కీడ్పడువేళన్=ప్రసుక్కుడు
సమయమందున్ను, జలంబున్=నీటిని, కోరి=ఆసించి, తత్తరమున = తడఁబా
టుతో, త్రవ్వినన్ = భూమిలో త్రవ్వఁగా, కలదే=నీళ్లు 'కలుగునా?
(అట్లే సంపద లుండిన కాలమున పుణ్యములు సేయక అదిపోయిన వెనుక
చేయకపోతిమే యని చింతించుట వ్యర్థమని భావము)

తా. సంపద యుండిన కాలమందును, సంపదచే మదించి ఒడలు మరచియుండిన కాలమందును ఆలోచించి పుణ్యకార్యములు మాటి మాటికిచేయకపోతినే యని జీవతనము వచ్చిన వెనుక చింతించుట, గాలిచే మిక్కిలి రేగిన నిప్పును ఆర్పుటకును, బాగా దప్పి గొనినప్పుడు జలముకై భూమిని వేగిరపడి త్రవ్వుట యెట్లో అట్లే వ్యర్థమగును.

ఉ. జీవనమింకc బంకమున • జిక్కినమీను చలింపకెంతయున్
దావున నిల్చి జీవనమె • తద్దయుc గోరువిధంబుచొప్పడం
దావలమైనcదానిగుఱి • దప్పనివాcడు తరించువాcడయా
తావకభక్తియోగమున • దాశరథీ కరుణాపయోనిధీ, 94

టీ. జీవనము=నీళ్ళు, ఇంకc=ఇంకిపోcగా, పంకమునc = బురద యందు, చిక్కినమీను = చిక్కినచేcప, ఎంతయుc = ఎంతమాత్రమును, చలింపక=కదలక, తావునc=తానున్నచోటనే నిల్చి=ఉండి, జీవనమె=నీటినే లేక బ్రతుకునే,తద్దయుc=మిక్కిలి, కోరువిధంబు=కోరునట్టిరీతి, చొప్పడc=కలుగునట్లుగా, తావలమైనదానిc=స్థానమైనదానిని, తనకు ఆధారమైన దానిని, (తనకు ఉజ్జీవకమైన నిన్ను అనుట) గుఱిదప్పనివాcడు=గుఱి చెడనివాcడు (తనకు ఆధారభూతుcడైన నీయందే గుఱియుంచి ఆగుఱిని తప్పక నిన్నే ధ్యానించుచుండువాcడు) తావక భక్తియోగమునc = నీదైన భక్తితోడి కూడికచే, తరించువాcడయా = సంసారమును దాటువాcడు అయ్యా.

తా. చేcప, నీళ్లు ఎండిపోయిన బురదలో యున్నను, ఆచోటును విడిచి కదలక అందే నిలిచి నీళ్ళనే తుదకు కోరునట్లు నీయందలి చింతనము నందే గుఱియుంచియెన్ని కష్టములు వచ్చినను దానిని వదలక యుండువాcడు అట్లుండుటచే నీయెడల భక్తియుదయించి ఆ భక్తియోగమున సంసారమును దాcటునని తాత్పర్యము.

చ. సరసునిమానసంబును రసజ్ఞుఁడెఱుంగును ముష్కరాధముం
డెటిఁగి గ్రహించువాఁడెకొల నేకనివాసముగాఁగ దర్దురం
బరయఁగ నేర్చునెట్లు వికచాబ్జమరందరసైక సౌరభో
త్కరము మిళిందమొందు క్రియ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. సరసునిమానసంబు=రసజ్ఞుని మనస్సును, సురసజ్ఞుఁడు=మిక్కిలి రసమును తెలిసినవాఁడు, ఎఱుంగును, తెలియును, ముష్కర+అధముఁడు = మొఱకైననీచుఁడు, గ్రహింపఁగలఁడా, ఇందులకు దృష్టాంతము:-దర్దురము= కప్ప, కొలను=సరస్సు, ఏక నివాసముగాఁగన్ = ఒక్కటే ఉనికిపట్టుకాఁగా (కొలనునందే ఎప్పుడును ఎడతెగక ఉండునదైనను) వికచ = ఆకొలనునందు వికసించిన, అబ్జ=తామరయొక్క, మకరందరస=పూఁదేనె ద్రవము యొక్క, ఏక=ముఖ్యమైన, సౌరభ=వాసనలయొక్క, ఉత్కరము = సమూహమును, మిళిందము=(మూరమునసుండు) తుమ్మెద, ఒందుక్రియన్ = పొందు రీతిని, ఎట్లు=ఏరీతిని, అరయఁగ నేర్చు=విచారించి తెలిసికొన నేర్చును?

తా. రామా! కప్ప సరస్సులోనే యెప్పుడునివాసము చేయుచుండునదైననుఅందుండిన తామరలయందలి పూదెనె వాసనలను తెలిసికొనజాలదు. తుమ్మెదయో, దానిని తెలిసి యనుభవించును. అట్లే రసికుని మనస్సులోని భావమును రసికుఁడే తెలిసికొని యానందింప గలడుగాని మూర్ఖుఁడైన యల్పుఁడు తెలిసికొనఁజాలఁడు.

ఉ. నోఁచినతల్లిదండ్రికిఁ దనూభవుఁడొక్కఁడెచాలు మేటిచే
వ్రాఁచనివాఁడు వేఱొకఁడు వాచిన లేదనకిచ్చువాఁడు నో
రాఁచి నిజంబకాని పలుకాఁడనివాఁడురణంబులోన మేన్
దాఁచనివాఁడు భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. 96

టీ. నోఁచినతల్లిదండ్రికిన్ = పూర్వజన్మమందు పుణ్యవ్రతము నోఁచినట్టి తల్లిదండ్రులకు, చే = చేయి, చాఁచనివాఁడు = యాచింపనట్టివాఁడనుట, వేఱొకఁడు = మఱియొకఁడు, చాఁచినన్ = (తన్నుగూర్చి) చేయి చాఁపగా (తన్ను యాచింపఁగా) లేదనకిచ్చువాడు = యాచించునది లేదనక యిచ్చునట్టి వాఁడును, నోరు అంచి = అడ్డగించి, నిజంబ = సత్యమే, కానిపలుకు = అబద్ధపుమాటలను, ఆడనివాఁడు = చెప్పనివాఁడును, (అబద్ధము చెప్పుటకు నోరు మూసికొనునే కాని నోరు తెరచి నిజమే చెప్పువాఁడనుట) రణంబులోనన్ = యుద్ధమునందు మేన్ = ఒడలిని, దాఁచనివాడు = మాటు చేయనివాఁడు, ఇట్టివాఁడైన, మేటి = శ్రేష్ఠుఁడగు, తనూభవుఁడు = కొడుకు, ఒక్కఁడే చాలున్ = చాలును (ఇట్టి లక్షణములు లేనికొడుకులు పెందఱు పుట్టినను పుట్టనట్లే యని భావము.)

తా. ఒకరిని దేహి అననివాఁడును, ఒకరు తన్ను యాచింపఁగా లేదనకిచ్చువాఁడును, నోరుదెరచి యబద్ధము చెప్పనివాఁడును, యుద్ధమందు వెను దీయనివాఁడును, అగుకొడుకు పుణ్యము చేసిన తల్లిదండ్రులకు. ఒక్కఁడే కలిగిన జాలును. చాలామంది అక్కఱలేదు.

చ. శ్రీయుతజానకీరమణ ♦ చిన్మయరూప రమేశరామ నా
రాయణ పాహిపాహియని ♦ ప్రస్తుతిఁ జేసితినామనంబునం
బాయక కిల్బిష వ్రజవి ♦ పాటనమందఁగఁ జేసి సత్కళా
దాయిఫలంబునాకియవె ♦ దాశరథీ కరుణాపయోనిధీ .97

టీ. శ్రీయుత = కాంతితోఁ గూడిన వాఁడా, జానకీరమణ = సీతాదేవికి పెనిమిటియైనవాఁడా, చిత్ + మయ = జ్ఞానమయమైన, రూపా = స్వరూపముగలవాఁడా, రమా + ఈశ = లక్ష్మికి పతియైనవాఁడా, రామా = అందఱిని రమింపఁ జేయువాఁడా, నారాయణ = నారములను సకల చేతనాచేతనములను వాసస్థానముగాఁగలవాఁడా, పాహిపాహియని = కావుము కావుము అని, ప్రస్తుతిన్ చేసితి = స్తోత్రము చేసితిని, నామనంబునన్ = నామనస్సునందు, పాయక = విడువక. కిల్బిష = పాపములయొక్క, వ్రజ = సమూహములయొక్క, విపాటనము = ఖండించుటను, అందఁగన్ చేసి = లభించునట్లు చేసి

(నాపాపములను నాశముచేసియనుట) సత్కళా=మంచికళను, దాయి = ఇచ్చునట్టి, ఫలంబున్=ఫలమును, నాకు ఇయవే=ఇమ్మా.

తా. ప్రకాశించురామా! జానకీరమణా! లక్ష్మీపతే! అనిస్మరించెదను. నామనస్సునందు నిలచిపాపములను పారద్రోలి నన్ను కావుము అని భావము

ఉ. ఎంతటిపుణ్యమో శబరి • యెంగిలిగొంటివి వింతగాదె నీ
మంతన మెట్టిదో యుడుత • మైనిగ రాగ్రనఖాంకురంబులన్
సంతసమందఁ జేసితివి • సత్కులజన్మము లేమి లెక్క నే
దాంతముగాదె నీమహిమ • దాశరథీ కరుణాపయోనిధీ. 98

టీ. శబరియెంగిలిన్=శబరి గొరికి చవిచూచటచే ఎంగిలియైన పండ్లను, కొంటివి=తీసికొంటివి, (భక్షించితివి) ఎంతటిపుణ్యమో=అది చేసికొన్న పుణ్యము ఎంత యెక్కవో, వింతకాదె=ఇది ఆశ్చర్యము కాదా, (దేవతలు ఇచ్చునట్టి శ్రేష్టపదార్థములను గ్రహింపని నీవు, అల్పురాలైన శబరి ఎంగిలిని, తినుట చూడఁగా, దాని పుణ్యము మిక్కిలి యాశ్చర్యపైనదనుట నీమంతము=నీరహస్యము (నీకు ఉడుతమీఁద ప్రేమాతిశయము గలుగుటకు రహస్యము,) ఎట్టిదో=ఎటువంటిదో, ఉడుతమైని = ఉడుత దేహమున, కరాగ్ర=వ్రేళ్ళయొక్క, నఖ+అంకురములన్=గోటి మొనలచేత, సంతసముఅందన్=సంతోషపడునట్లు, చేసితివి = గోళ్లతో గీరి ఉడుతను సంతోష పెట్టితివనుట, సత్కులజన్మములు=మంచి వంశమున పుట్టుకలును, ఏమిలెక్క=నీకేమలక్ష్యము (నీవు వంశమును, జాతిని చూడవు, అనుట) నీమహిమ=నీమహాత్త్వము, వేదాంతముగాదె=వేదాంతమేకదా( నీమహిమచే జాతిని కులమును జూడక రక్షించునట్టి వాఁడవైతి వని భావము.

తా. శబరి యెంగిలిని తింటివి. అది యెంత పుణ్యము చేసినదో ఆశ్చర్యముగా నున్నది. ఉడతమైని ముంగోళ్ళతో గీచి సంతోష పెట్టితివి. దానిపైనింత ప్రేమ కలుగుటకు కారణమేమో తెలియకున్నది. విచారించి చూడఁగా నీవుజాతిని కులమును చూచువాడవు కావు. ఔను

నిమహాత్మ్యము వేదాంతప్రతిపాద్యమగునంత విస్తారమైనది. కాన నిరక్షణము నకును శిక్షణమునకును కారణములు మముబోంటులకు తెలియవు.

ఉ. బొంకనివాఁడె యోగ్యుఁడరిబృందములెత్తినచోటజివ్వకున్
జంకనివాఁడెజోదు రభ సంబున నర్థికరంబు సాచినం
గొంకనివాఁడెదాత మిముఁగొల్చిభజించినవాఁడెపోనిరా
తంకమనస్కుఁడెన్నఁగను దాశరథీ కరుణాపయోనిధీ. 99

టీ. బొంకనివాఁడె = అబద్ధమాడని వాఁడే, యోగ్యుఁడు, అరి బృందములు=శత్రుసమూహములు, ఎత్తినచోట=దండెత్తివచ్చిన యెడల, చివ్వకున్=యుద్ధమునకు, జంకనివాఁడే=వెనుకదీయనివాఁడే, జోదు=యోధుఁడు, రభసంబునన్= వేగముగా, అర్థి=యాచకుఁడు, కరంబు=చేతిని, చాఁచినన్=చాఁచఁగా, కొంకనివాఁడే=ఇచ్చుటకు మిణకరింపని వాఁడే, దాత, మిమున్=మిమ్ము, కొల్చి=సేవించి, భజించినవాఁడె=ధ్యానముచేసినవాఁడే, నిరాతంక=ఆతంకము లేని, మనస్కుఁడు = మనస్సుగలవాఁడు (నిన్ను గొల్చిన వాని మనసే నిర్మలముగా నుండునని భావము.)

తా. బొంకనివాడు ఉత్తముడు. శత్రువులకు యుద్ధమునందు వెన కాడక యుద్ధముచేసినవాడె యోధుడు. యాచకునికి వెనుదీయక దానముచేసిన వాడే దాత. మిమ్ముల ధ్యానించినవాడే యోగి, వాడే పరమపదము జెందునని తాత్పర్యము.

చ. భ్రమరముకీటకంబుఁగొని పాల్పడి ఝూంకరణోపకారియై
భ్రమరముఁగా నొనర్చునని పల్కుటఁజేసిభవాదిదుఃఖ సం
తమును మెడల్చి భక్తిసహి తంబుగ జీవుని విశ్వరూప త
త్త్వమున ధరించు టేమరుదు దాశరథీ కరుణాపయోనిధీ. 100

టీ. భ్రమరము=తుమ్మెద, కీటకంబున్=పురుగును: కొని, పాల్పడి= దానికై పూని, ఝూంకరణ+ఉపకారియై = ఝూంకారముచేత ఉపకరించి, భ్రమరముగాన్=తుమ్మెదగా, ఒనర్చునని=చేయునని, పల్కుటఁజేసి=చెప్పుటచేత (జనులువాడుకొనుటచేత) జీవునిన్, భవ=పుట్టుక, ఆది= మొదలు గాఁగల, దుఃఖసంతమసము=దుఃఖములనెడి చీకటిని, ఎడలించి=పోఁగొట్టి భక్తిసహితంబుగన్=భక్తితోఁగూడ-లేక "భక్తిజనితంబుగన్ "అను పాఠ

మున, (భక్తిఉదయింపఁగా) విశ్వరూపతత్త్వమునన్=నీయొక్క విరాట్స్వరూపమునందు, ధరించుట=తాల్చుట, ఏమి, అరుదు=ఆశ్చర్యము, (నీతోసమానమైన ఆకారముగలవానినిఁగా చేయుట ఏమివింత)

తా. ఒక కేవలజంతువైనతుమ్మెద, పురుగును తనవలె తుమ్మెదగాఁ జేయుట లోకమునను తెలియుచుండఁగా నీవు జీవునిదుఃఖములు పోఁగొట్టి, భక్తిని గలిగించి వానికి నీతోడి సారూప్యమునొసఁగుట ఆశ్చర్యముగాదని) అర్థము.

చ. తరువులుపూచికాయలగుఁ • దత్కుసుమంబులుపూజగాభవ
చ్చరణము సోఁకిదాసులకు • సారములౌ ధనధాన్యరాసులై
కరిభటఘోటకాంబర ని • కాయములై విరజానదీసము
త్తరణమొనర్చుఁజిత్రమిది • దాశరథీ కరుణాపయోనిధీ. 101

టీ. తరువులు=చెట్లు, పూఁచి=పుష్పించి, కాయలగున్=కాయలు కాఁచును, తత్+కుసుమంబులు=ఆపూవులు, పూజగా=(కోసి) పూజార్థముగా, భవత్+చరణము=నీపాదమును, సోఁకి=తాకి, దాసులకు=నీభక్తులకు, సారములు=శ్రేష్ఠములు, ఔ ధనధాన్యరాసులై=అగునట్టి ధనధాన్యములకుప్పలై, కరి=ఏనుఁగులు, భట=బంట్లు, ఘోటక=గుఱ్ఱములు, అంబర=వస్త్రములు, వీనియొక్క నికాయములై=సమూహములై, విరజానదీ=పరమపదము ఎల్లగానుండు విరజ అను ఏటిని, సముత్తరణము = దాఁటుటను, ఒనర్చున్=చేయును, ఇది=నీపాదములు సోఁకినపూలు, చిత్రము – ఆశ్చర్యము.

తా. రామా! చెట్లయందలి పూవులు అట్లే యుండినయెడల కాయలగును. వానినే గోసి నీపాదములందు ఉంచి పూజింపఁగా అవి నీయడుగులు సోఁకఁగానే మేలైన ధనధాన్యములును, ఏనుగులు, బంట్లు, గుఱ్ఱములు, వస్త్రములు మొదలైనవిగా ఇహలోకమునపరిణమించి పరమపదమును కలిగించును.

ఉ. పట్టితిభట్టరార్యగురు • పాదములిమ్మెయినూర్ధ్వపుండ్రముల్
పెట్టితి మంత్రరాజమొడిఁ • బెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణ • కంజములందుఁదలంపుపెట్టి పోఁ
దట్టితిపాపపుంజముల • దాశరథీ కరుణాపయోనిధీ. 102

టీ. భట్టరార్య గురుఃపాదములు = గురువులగు భట్టరాచార్యులవారి యొక్క పాదములను, పట్టితిఁ = చేపట్టితిని (వారి శిష్యుఁడనైతి) ఈమెయిఁ = ఈదేహమున, ఊర్ధ్వపుండ్రముల్ = తిరుమణి శ్రీచూర్ణములను, పెట్టితిని, మంత్రరాజము = మంత్రములలో గొప్పదైన తిరుమంత్రమును, ఒడిఁబట్టితిఁ = గ్రహించితిని, దానిచేత, ఆయమకింకరాళికిఁ = ఆయమదూతల సమూహమునకు, బొమ్మఁ, కట్టితిని = జయించితి. మీచరణకంజమునందు = మీపాదారవిందములందు, తలంపు పెట్టి = మనస్సునుంచి, పాపపుంజములఁ = పాపసమూహములను, పోఁ + తట్టితిని = పోవునట్లు పారదోలితి.

తా. భట్టరాచార్యులవారి శిష్యుఁడనై తిరుమణి శ్రీచూర్ణములు పెట్టుకొని తిరుమంత్రముపదేశ మొంది, నరకము తొలఁగించుకొని మీపాదార విందములను ధ్యానించుచు, పాపములను పోఁగొట్టుకొన్న వాఁడనైతిని.

ఉ. అల్లన లింగమంత్రిసుతు • డత్రిజగోత్రజుడాది శాఖ కం
చెల్లకులోద్భవుండన బ్ర • సిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచి • యించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను దాశరథీ కరుణాపయోనిధీ. 103

టీ. జగద్వల్లభ = జగన్నాథా, లింగమంత్రిసుతుఁడు = లింగమంత్రి కొమరుడ. అత్రిజగోత్రుఁడను = ఆత్రేయగోత్రముగలవాఁడను ఆదిశాఖ = ఋగ్వేదశాఖవాఁడు, కంచెర్ల కులోద్భవుండు = కంచెర్ల వంశమున బుట్టినవాఁడు, అనఁ = అనగా, ప్రసిద్ధుఁడనై, భవదంకితంబుగాఁ = నీకు అంకితముగా, ఎల్లకవుల్, నుతింపఁ = పొగడఁగా, రచియించితివి = ఈశతకము గూర్చితిని గోపకవీంద్రుఁడఁ = గోపకవిశ్రేష్ఠుఁడను, నీకుఁ, దాసుఁడను.

తా. రామా ! నేను లింగమంత్రికుమారుడను. నాది ఆత్రేయగోత్రము, ఋగ్వేదము శాఖ, కంచెర్లవంశము, పేరు గోపకవి. నీకు భృత్యుడను కవులందఱును పొగడునట్లుగా ఈ శతకమును కూర్చి నీకు అంకితము చేసితిని.

దాశరథిశతకము సమాప్తము

# శ్రీ కృష్ణదేవరాయ విజయం.

5 అంకముల చరిత్రాత్మకమగు నాటకము.

గ్రంథకర్త:—శనగవరపు రాఘవకవి.

ఇది చరిత్రాత్మకమైన నాటకరాజము. ఇందు శ్రీకృష్ణదేవరాయలయొక్క శౌర్యము, అన్నయొక్క దుర్మార్గము, తిమ్మరుసుయొక్క భక్తియు, తిరుమలాంబయొక్క పాతివ్రత్య మహాత్మ్యము మొదలగు అంశములతో ముద్రింపబడి విరాజిల్లుచున్న నాటకరాజము. నూతనముగా వెలువడినది. పద్యములన్నియు రత్నములే. వచనము కడు మనోహరముగా నుండును. నాటకరంగస్థలములకు అనుకూలముగా వ్రాయబడినది. వెల 0-12-0. కొలది ప్రతులుమాత్రమే కలవు. త్వరపడుడు.

# తపతీ సంవరణము.

ఈ నాటకము నవరసములొలుకు పద్యగద్యములతో వ్రాయబడినది. పెక్కుమంది పండితులచే ప్రశస్తగాంచినది. మొదటికూర్పు ప్రతులు శీఘ్రకాలములో అయిపోవుటచేత రెండవకూర్పు వెలువడినది. వెల 0-12-0.

# లవకుశ.

అందరకు తెలిసిన నాటకము - అందరిచేత ప్రశస్తగాంచినది. ప్రతివారికి తెలియుటచేత దీనిని గురించి వ్రాయుట అనవసరము. వెల. 1-4-0.

వలయువారు:—మారుతీరాం కంపెని,

బెజవాడ

